ఓమ్ !

# పరిక్షిత్తు.

(నాటక




గ్రంథకర్త

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

అయిదవ ముద్రణము



పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1937.

వెల రు 0—12—

# అంకితము.

——:o:——

ఏ సత్పురుషుఁడు తాను నిస్స్వుఁడయ్యు యాచించి కుగ్రామ మగు 'మేడపాడు' నందు మహాలింగేశ్వరాలయముఁ గట్టించి శివప్రతిష్ఠం జేసెనో, ఏవిరాగి మఱునాటికిఁ దన కుండునో లేదో యని సందేహింపక యన్నదానముం జేయుచుండువాఁడో, ఏ సర్వసముఁడు తా నభ్యంజనముఁ జేసికొనునపుడు బీదలగు పరిసరపు బాలబాలికలకు ముందుగ స్వయముగ తలలంటియుఁ బందుగులలో నంత్యజులకుఁ బిండివంటలతో భోజనము పెట్టించియుఁగాని తృప్తి నొందకుండెనో, ఏసంయమి సంగీతవిద్యావంతుఁడయ్యు సంగీతము సర్వేశు నుతించుటకే గాని సానులచే నాడించుటకుఁ బాడించుటకుఁ గాదని, సానిమేళములకుఁ బోనని శపథమూనియుండెనో, ఏ పౌరాణికుఁడు తన వాక్చాతుర్యముచే శ్రోతల నానందవార్ధిమగ్నులం జేయుచుండెనో, ఏజ్యోతిష్కుఁడు తన మరణదినముఁగూడఁ జెప్పి యట్లే పరమపదించెనో, వెనుకటి 'ప్లవంగసం॥ర జ్యేష్ఠ శుద్ధ ౧౩ నాఁడు' పుట్టి 'జయసం॥ర ఆశ్వయుజ శుద్ధ ౬ నాఁడు' పరమపదము నొందిన యా మాతండ్రిగా రగు వెంకయ్యగారికిని,

ఏ సాధ్వీమణి భర్తకుఁ దోడునీడయై యన్నదానాది సత్కర్మముల నాచరించెనో, ఏసతీమతల్లిక దానాసక్తిచే వండుకొను గిన్నె నొక యన్నసత్రనిర్మాతకును, మంగళసూత్రము

నొక విద్యావంతుఁడు తపస్వియు నగు సద్బ్రాహ్మణుని వివాహ మునకును, భర్త్రాజ్ఞచే బాన మొసంగెనో, ఏజనని తాను మంచ ము పట్టినను, ఏఁబదిమూఁడేండ్లుగల నన్నుఁగూర్చి నాయన భుజించినఁ గాని తాను భుజంప నని మనుమరాంద్రతో నను చుండునో, ఏశిశువత్సల తల్లిలేని నాయిరువురుకుమార్తెల నమృత హస్తయై పెంచి పెద్దవారిం జేసెనో, ఏపుణ్యవనిత గర్భశోకము నెఱుఁగక ముప్పురుకొమరులు, పదిమందిమనుమలు, ముమ్మను మలు కలదియై విద్వత్పుత్రిక, విద్వత్సోదరి, విద్వద్భర్తృక, విద్వత్పుత్రయై, అదృష్టవంతురా లనిపించుకొనుచు, వెనుకటి 'కాళయుక్తి సం॥ర ఆశ్వియుజ శుద్ధ ౧౫ నాఁడు' జన్మించి 'ఈ యాంగీరసనం॥ర ఆశ్వియుజ శుద్ధ ౬ నాఁడు' (ది 12-4-32సం॥) పరమేశ్వర సన్నిధానమునకుఁ జేరెనో యా మాతల్లి రామాంబ కును,

సచ్చరితమగు నీపరిక్షిచ్చరితము నంకిత మొనర్చు చున్నాను. ఇది నా పితృదేవతములకుఁ బుష్పసదృశ మగుఁ గాక.

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

ఓమ్ !

# పీఠిక.

---

పెక్కేండ్లు కళాశాలలలోను, ఉన్నతపాఠశాలలలోను, సంస్కృతాంధ్రభాషల కుపాధ్యాయుఁడనుగా నుండి బాలుర మనస్తత్త్వముల గుర్తెఱిఁగి యీగ్రంథము ననుభవపూర్వకముగ వ్రాసితిని. బాలురకు భాషతోఁగూడ, ప్రాచీనచరిత్ర, స్వసాంఘికమతాచారములు, దైవభక్తియు నేర్పుట మిగుల నావశ్యకమై యున్నది. మఱియు భారతీయులకుఁ బరమప్రమాణములగు వేదములలోని యంశములుకూడ బోధించుట ముఖ్యతమము. ఇపుడు విద్యార్థులు భవిష్యత్తున గృహస్థులు కాఁగలరు. వారు గృహస్థాశ్రమస్వీకారము నొందునపు డెటులఁ బ్రవర్తింపవలెనో తెలిసికొనుట యత్యవసరము. మఱియు దేశభక్తియు రాజభక్తియుఁ బ్రతిజనునకు ముఖ్యతమములు. పై యంశముల నిందు బీజప్రాయములుగఁ బొందుపఱచితిని. దీనిని గడచిన యేడేండ్లలోను బెక్కండ్రు పండితు లాదరించుటచే నాపరిశ్రమము వ్యర్థము కాలేదని యైదవముద్రణముం జేయించితిని.

ఇట్లు

పెం. వేం. సు. శాస్త్రి.

# విషయసూచిక.


| | | పుట. |
|---|---|---|
| 1 | పూర్వగాథ | 1 |
| 2 | పరిక్షిజ్జననము | 4 |
| 3 | ధర్మజుఁ డశ్వమేధయాగముఁజేయ నుద్యుక్తుఁ డగుట | 11 |
| 4 | అర్జునుని దిగ్విజయము | 15 |
| 5 | అశ్వమేధము | 23 |
| 6 | పరిక్షిత్తునిబాల్యదశ, ధృతరాష్ట్రాదుల మృతి | 28 |
| 7 | యాదవాంతఃకలహహేతువులు, తన్మరణములు, కిరాతునివిజృంభణము | 39 |
| 8 | పరిక్షిత్పట్టాభిషేకము | 51 |
| 9 | పాండవుల స్వర్గారోహణము | 53 |
| 10 | పరిక్షిద్రాజ్యపాలనము | 63 |
| 11 | మాద్రవతీపరిక్షిత్తుల వివాహయత్నము | 72 |
| 12 | పరిక్షిత్తు మాద్రవతిం బెండ్లియాడుట | 76 |
| 3 | గోపరిపాలనము | 82 |
| 4 | మృగయావ్యసనము | 90 |
| .5 | పరిక్షిత్తు శాపతప్తుండగుట | 94 |
| 16 | పరిక్షిత్ప్రయత్నములు | 97 |
| 17 | శ్రీశుకోపదేశము | 98 |
| 18 | తక్షకుని ప్రయత్నములు | 107 |
| 19 | కశ్యపునికథ | 108 |
| 20 | తక్షకకశ్యపుల సంవాదము | ,, |
| 21 | పరమేశ్వరనుతి_పరిక్షిన్మరణము | 114 |
| 22 | లఘుటిప్పణము | 118 |

# పరిక్షిత్తు.

—:o:—

## ప్రథమ ప్రపాఠకము.



## ప్రథమానువాకము.



### పూర్వగాథ.

శ్రీమహావిష్ణునాజ్ఞచేఁ బ్రవర్తించు నిప్పటి చతుర్ముఖుని ద్వితీయపరార్థమున, శ్వేతవరాహకల్పమునం దగు వైవస్వత మన్వంతరంబునందలి యీకలియుగమునఁ బదునాఱువందలయిరు వదాఱు సంవత్సరములు గడచినపిమ్మట * శ్రీమతంబగు నీ భరతఖండంబున నొకమహాసమరము ప్రవర్తిల్లెను. అది కురు క్షేత్రము కేంద్రస్థానముగాఁ గలది యగుటచేఁ గురుక్షేత్రసం గ్రామమనియు, కౌరవులకుఁ బాండవులకు నైన యుద్ధమగుటచేఁ గురుపాండవయుద్ధమనియు భరతవంశస్థులే యందుఁ బ్రధాన నాయకు లగుటచే భారతయుద్ధమనియుఁ బేరు వడసెను.

అమ్మహాజన్యమునఁ బెక్కువేలుగజములు, ననేకలక్షల హయములు, మడియుటయే కాక, డెబ్బదిరెండులక్షలకు మిం

* విష్ణు వాయు భాగవతాది పురాణములనుండి యీకాలనిర్ణయము చేయఁబడినది.

చిన దృఢాంగులగు మనుష్యులును మృతినొందిరి. ఆవీరులలో శతాధికవయస్కులు మొదలు పదునాఱేండ్ల ప్రాయమువఱకుఁ గలవా రుండిరి. భరతఖండ మిప్పటివలె నప్పుడు ముప్పది మూఁడుకోట్ల జనసంఖ్య గలదికాక, స్వల్పజనసంఖ్యాకలిత మగుటచే నంతటి జననష్టమును సహింపలేక నతితమముగా సంక్షోభించెను. దేశమునం దేమూలఁ జూచినను, తండ్రులు సోదరులు సుతులు భర్తలు బంధువులు గతించుటచే నవయు ననాథలగు సతీమతల్లులకన్నీటిచే భారతభూమి పంకిలమై వారి రోదనములచే దశదిశలు ప్రతిగోదనముఁ జేయుచుండెను. కురుక్షేత్రము యుద్ధమున కెటులు కేంద్రస్థాన మయ్యెనో, స్త్రీల రోదనములకును నటులనే కేంద్రస్థాన మయ్యెను. అందు హాస్తిపురి మఱియు డిమిబొట్టయ్యెను. ఆపట్టణమునం దేవంకఁజూచినను భర్తృబంధుసుతాదులమరణములచే శోకించువనితలరోదనములే—ఏవైపుఁజూచినను బంధుమరణకారకులగుఁ బాండవుల శపించువాక్యములే—ఏదెసఁ జూచినను యుద్ధములోని భయంకరవార్తాప్రసంగములే—ఏప్రక్కఁ గనుగొనినను భర్త్రాదిమరణములచే నగు వృత్తిభంగమువలన నైన దరిద్రతకుఁ గాతరులగు స్త్రీలయొక్కయు, బాలబాలికలయొక్కయు, వృద్ధులయొక్కయు విలాపములే—ఏదిశం గనినను క్షతగాత్రుల హాహాకారములే ప్రవర్తిల్లెను. హాహాకారములతోఁగూడిన యుద్ధములోని సైనికుల విషాదమరణములఁ జూచియుఁ బురిలోని రోదనముల వినియు

బంధుమిత్రపుత్రాదుల మరణములచే మహావిచారము నొందియు ధర్మరాజు కృపణతాసంతప్తహృదయుండయి విరక్తిచే రాజ్యము నొల్లననఁగా, సోదరులు, ద్రౌపది, మొదలగు వారాతనిఁ బ్రవృత్తిమార్గమునకుఁ ద్రిప్ప నెంతగాఁ బ్రయత్నించినను నాతనిమనస్సు తేఱుకొనదయ్యె. పిమ్మట శ్రీకృష్ణభగవానుఁడును, కర్మయోగంబునకుఁ ద్రిప్ప నెంత యో యత్నించె. యుద్ధారంభమున నర్జునుని మోహముంబోలె నేఁడు ధర్మజుని 'కార్పణ్యదోషోపహతస్వభావమును' శ్రీకృష్ణుఁడు పోఁగొట్టలేఁడయ్యె. పిమ్మట శ్రీవ్యాసభగవానుఁడు తనవాక్పుణ్యముచే నాతని కుపదేశించిన ప్రవృత్తిమార్గమునుండి పెడమొగము పెట్టించి రాజ్యాభిషేకమునకును పి[illegible]ట మూఁడశ్వమేధయాగములఁ జేయుటకును హేతువయ్యెను. వ్యాసు నానతి ధర్మరాజు "అహీన"మను నశ్వమేధమ్ము యజించెను. పాండవులు సంతాననాశముచే నంతప్తులగుచు, అభిమన్యుకళత్రమగు నుత్తర గర్భవతి గాన తద్గర్భస్థశిశువునందే తమ సకల మనోరథముల నాధారముఁ జేసికొని యూఱడిల్లుచుండిరి. అశ్వమేధయాగమునకు ద్రవ్యమును సంపాదించుటకుఁ బోకతప్పనందున ధర్మజుఁడు, స్వసైన్యుఁడగు *'యుయుత్సునిఁ' బురరక్షణమునకు నియోగించి సోదరులను, సైన్యమును దోడ్కొని వ్యాసోపదేశముచే,

* ధృతరాష్ట్రునకు వైశ్యాస్త్రీయందుద్భవించినవాఁడు. యుద్ధకాలమునఁ బాండవులపక్షముఁజేరి జీవించెను.

ఉత్తరాప్రసవకాలమునకుఁ బూర్వమే హిమాలయోత్తరభాగము నకుఁ బోయెను. ధర్మరాజాదులు పురము వెలువడిన మఱు నాఁడె యశ్వమేధయాగనిర్వహణమునకు ధర్మజునిచే నంతకు మున్నె యాహ్వానితుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు తద్యాగనిర్వ హణ కుతూహలాయత్తచిత్తుఁడయి సహోదరమిత్రపరివారముగ హాస్తిపురి కేతెంచెను.

---

## ద్వి తీ యా ను వా క ము.

### పరిక్షిజ్జననము.

శ్రీకృష్ణుఁడు హస్తిపురిఁ బ్రవేశించిననాఁడె యుత్తరకుఁ ౦సవవేదన మారంభ మయ్యెను. ఆమె సూతికాగృహము, ౦రిష్టోచితపరికరసహితమై, అరిష్టశూన్యమై, అనిష్టహీనయై ౦గదాధరపరిరక్షితమై, అగదంకారసన్నిహితమై, యొప్పెను. మ ఱియు ధవళకుసుమయుక్తములు, సితసర్షపసహితములు లాజ పూర్ణములు నగుకుంభములచే శుభప్రదంబై విరాజిల్లెను. ప్రజ్వ లితాగ్నిచేతను, ప్రదీప్తశస్త్రాస్త్రములచేతను, పిచుమందపల్ల వాదులచేతను, బాలగ్రహాదిభూతపరిహారభూతమై, చికిత్సకులు

దక్షులు చతురలు వృద్ధలు హితలు నగు పుణ్యవనితలచేఁ బరిపరి విధములఁ బరిశోధింపఁబడుచు నిర్మలమై యుండెను.

ఆమె ప్రసవ వేదనా దోదూయమాన యగుచుండియు, అభిమన్యు మరణజ్ఞప్తిచేఁ జింతామగ్నయయ్యు, జనిష్యమాణ పుత్రముఖావలోకన కౌతూహల మొకవంక నాకర్షించి దుఃఖాప నోదన మొనర్చుచుండ స్వల్ప ప్రసవవేదన మొందియె పురుష శిశువుం గనెను.

వెంటనే పుణ్యాంగనలు పురుషుఁడు పుట్టె పురుషుఁడు పుట్టెనని కేకలు వెట్టిరి. పౌరులందఱు సంతోషసూచకధ్వనులఁ జేసిరి. వెన్వెంటనే మృతశిశువని సూతికాగృహములోనివారు వెక్కి వెక్కి యేడ్చిరి. కుంతీసుభద్రాదుల కేకాక పౌరులందఱకుఁ గలిగిన యానందశోకరసముల భావశబలత యొక్కక్షణములోఁ శోకరసమునకు స్థాయీభావహేతువయ్యెను. ఉత్తర మృతశిశువుం గనుటను వినుటచేఁ గృష్ణసాత్యకులకుఁగూడ విషాదము జనింపఁ గృష్ణుఁడు సాత్యకితోఁ గుంతియున్నెడకు సత్వరంబున జనుదెంచుచుఁ దన కెదురుగవచ్చు కుంతీసుభద్రాద్రౌపదులఁ గాంచి తానును విషాదాకులమానసుండయ్యె. అప్పుడా పృథ పురుషోత్తముకడ డగ్గుత్తిక నెలుంగుపగుల నిట్లని యేడ్చెను.

"కృష్ణా! నాకును మత్సంతతికిని నీవే గతియైయుంటివి; కుత్సితుఁడగు నీ మేనల్లునకుఁ గూరుండగు నశ్వత్థామయొక్క యిషీకాస్త్రపాతిచే మృతబాలుం డుద్భవించెను. అయ్యశ్వ

త్థామ దారుణం బగు బ్రహ్మశిరోస్త్రముఁ బ్రయోగించునపు డుత్తరాగర్భస్థశిశువు నవశ్యముఁ గాచెదనని కృపాయత్తచిత్తుఁడ వై ప్రతినఁజేసితివి. కాన నీనిసుఁగును బ్రతికింపవా? ఆశిశువు యొక్క జీవితముతోడనే నాజీవిత మున్నది. ఆశిశువు బ్రతుక కున్నయెడల ద్రౌపదీసుభద్రలు జీవింపరు. ధర్మజుఁడు నాతని సోదరులు నట్టివారె. ఈవంశమున నుదకపిండప్రదానము లా శిశువు జీవింపకున్న నెడలును. మత్స్యనందన నీచే నొకనాఁడు "నీగర్భజనితుఁడు నాచేఁ గాపాడఁబడు నని యూఱడింపఁ బడినది. కాన నీమెయూర్తిని దొలఁగింపవే! నీ వీ ఫలమును నిలి పితివి; దాని నీబాలుని జీవింపఁజేసి స్థిరపఱుపవే" అని వెక్కి వెక్కియేడ్చి యిలాతలంబున గూలఁగెను. అపుడు ససంభ్రముఁ

గోవిందుం డాపృథను లేవనెత్తి యనునయవాక్యంబులం

ప్చుచుండ సుభద్రయు నిట్లు విలపించెను.

"కృష్ణా! గురుపుత్త్రుండు భీమునిపై నెత్తిన మహాస్త్రంయొక్క ఫలము నర్జునుఁడును దత్పుత్త్రియుఁ దనను బొందిరి. మఱంది యా యభిమన్యుపైఁ గల యధికప్రేమముచే నాతని మరణమునకు వగచుచుండ నీమనుమఁడుఁగూడ నిట్లు వమ్మయిన నాతఁ డేమగునో నీకే తెలియును. ధర్మజుఁ డేరీతిని నెవ్వగ భరి యించును? భీముఁడును గవలు నేరీతి దుఃఖశాంతి నొందుదురు? కృష్ణా! వినుము; గురుసుతుఁ డస్త్రముఁ బ్రయోగించునపుడు నీ వాతని నదలించి కుచ్చితుఁడా! నిన్ను మోఘాస్త్రం జేతు

నంటివి. ఉజ్జ్వలతేజుఁడవగు నీ మహిమానుభావము మాకుఁ దెలియుటచే నూఱడిల్లియుంటిమి. అశ్వత్థామాస్త్రభీతి నొంద కుంటిమి. సత్య దయాశ్రితాభిరక్షలు నీ నైజగుణములు. నీ కనేకవందనములఁ జేతు. దేవా! వెఱ్ఱులమై మేము వగపుచే వివిధప్రలాపములు నీయెదురఁ జేయుచుంటిమి గాని, లోకము లన్నియు మృతినొందినను బునరుజ్జీవింపఁజేయు శక్తిగల నీవు మాకొలంబుఁ గాపాడక నీమేనమఱంది పౌత్రుఁ జావవిడుతువా?" అని శోకించె.

అంతఁ గృపాశోకంబులు మల్లడిఁగొను నుల్లంబుతో శ్రీకృష్ణభగవానుఁడు మేఘగంభీరస్వనంబున బాలు బ్రదుకఁ జేయుదునని మెల్లవారు మోదమందఁ బలికి కుంతీసుభద్రాదుల వెంట సూతికాగృహంబుఁ బ్రవేశింపఁ బురోగామియగు ద్రౌపది యడలునఁ బుడమిఁ బడియున్న యుత్తరను లేవనెత్తి 'మత్స్యనందనా! మాధవుఁ డేతెంచెఁ గనుమా' అన నమ్మానిని వికీర్ణవేణీభరంబుతో వెన్నునకు మ్రొక్కుచు మాధవా! "భక్తార్తిఁ బాపుట నీకతివృథవ్రతముగాదా? ఈబాలుని బ్రతికింపవా? గోవిందా! నీవు నీమేనల్లునకుఁ గూఁతేని వానికుమారుని ద్రోణనందనుఁడు పొలియఁజేయఁగలాఁడే? పతిహీనయగు పాపాత్మురాలను నాకుఁ బుత్రహీనతయు నైన నెట్లు బ్రతుకుదును? ఈనిసుఁగుచావు నిక్కమయేని నిక్కముగ నిష్పుడ నీమేనల్లుని తావున కేనును బోవుదును. పద్మనాభా! నీవు వచ్చినపుడు

నీసన్నిధికి బాలు నెత్తుకొనివచ్చి మ్రొక్కింతునని యాస పడు చుంటిని. ఆ మానను ద్రౌణి నమ్ముచేసె" అని విలపించి యంత నిలువక మృతబాలు నంకతలంబున నిడికొని తదాననం బాలో కించి "పుత్త్రా! లోకగురుండగు తాత దామోదరుండు వచ్చి యుండఁగా ధర్మవేది యగు తండ్రికి జన్మించిన నీవిట్లు ధర్మ వ్యతిరేకముగా మ్రొక్కకుండుట యుచితమా! కన్ను విచ్చి నన్నును గుంతీమహాదేవిని జూడవా? ద్రౌపదీసుభద్రలం గన వా?" యని బిట్టు పలవించుచు మూర్ఛిల్లెను. ఆమెయొక్క యప్పటియవస్థఁ గనుఁగొని కరుణాతిశయముచే విలీనతనొందిన మనంబులు, సబాష్పనయనంబులు, వాడటినమోములుగల కౌర వాంగనలఁ గాంచినఁ బగవారి కైనను విచారాతిశయము గలు గకపోదు. ఇట్లుండఁ గొంతతడవునకు మత్స్యరాజనందన తెలి వొంది యట్లేయుండి ఫాలతలంబునఁ గేలు మోగిచి వెక్కివెక్కి యేడ్చుచు గోపాలదేవునకు మ్రొక్కుచు శరణుశరణని పలికిన నప్పరమకృపానిధి యోడకోడకుమని పాండవస్త్రీజాల నోపస్పర్శనం బులఁ గావించి బ్రహ్మాస్త్రప్రయోగవిధిచే నశ్వత్థామప్రయు క్తంబును, బ్రహ్మశిరోనామకంబుననగు నమ్మహాస్త్రంబు నుప సంహరించి యబ్బాలుని మృతకళేబరమును శయ్యాతలంబునఁ బెట్టంబనిచి దరోల్లసితుడై యెల్లవారు విన శ్రీకృష్ణుఁ డిట్లనియె. "ఓ వ్రజలారా! సత్యమగునామాట వినుఁడు. మీరును బాండ వులు నిబ్బాలుం గని యామోదింపఁ బ్రతికింతు నని ప్రతిన సేసి,

తే. పగఱయెడ నైన నే బొంకు ♦ పలుకనేని
సమరముఖమున నెన్నఁడుఁ ♦ జలితవృత్తిఁ
బిఱిఁది కడు గిడనేని యి ♦ ప్పిన్నవాని
యంగమున జీవ మీపొద్ద ♦ యావహిల్లు.

క. ధరణీసురకులమునెడం
గర మెక్కుడు ప్రియము నాకుఁ ♦ గలదేని, సధ
ర్మరతుఁడనయేని, నియ్యు
త్తరానుతుఁడు లబ్ధజీవి♦తత్త్వము నొందున్.

తే. మహితసత్యంబు పరమధ♦ర్మంబు గాఢ
నిర్మలబ్రహ్మచర్యంబు ♦ నిత్యసంప్ర
తిష్ఠితంబులై నాయందుఁ ♦ దేజరిల్లు
నేని యిబ్బాలునకు జీవ ♦ మిపుడవచ్చు.

అని పలుకునంతలో నబ్బాలకునిలో జీవంబు ప్రవేశించి యంగకంబులు గదల నచటనున్నవారల హృదయాంబుజంబు లాబాలకుని నయనాంబుజంబులువలె వికసించె. ఆసూతికాగృహంబును నబ్బాలకుని యంగకంబులు ప్రకాశించిన వడువునఁ బ్రకాశించె. బాలకుని రోదనధ్వనితోఁగూడ సూతికాగృహగతులగుజనులహర్షధ్వనులును, వెనువెంటనే పౌరుల యానంద ధ్వనులును, తోడ్తోడ దుందుభిభేరీకాహళాది మంగళధ్వనులు భూనభోంతరాళములఁ బొదుకొనియె. అట్టియెడ నుత్తర బాలు నడ్డాన నిడుకొని వాసుదేవునికడ కేతెంచి సాగిలఁబడి మ్రొక్కి

వినుతించె. నాటినుండియు శ్రీకృష్ణునకు 'పరీక్షిత్ప్రాణసంధాత' యను మహాబిరుదము కలిగె. కుంతీపాండవు లానందసాగరమున నోలలాడుచు శ్రీకృష్ణు నానందపరవశవాక్యంబుల వినుతించిరి. ఆ హస్తిపురమునందు శోకరసము పోయి యానందరసము వెల్లివిరిసె. అప్పుడు శ్రీకృష్ణుఁ డుత్తరాసూనుఁ జేతఁ నిడుకొని, ఇక్ష్వాకులుం డాదిరాజగుణయోగియు వంశోద్ధారకుండును నగుఁ గాక అని యాశీర్వదించి,

తే. ఆత్మకులము పరిక్షీణ • మైన జనన
మందెఁ గాన నియ్యభిమన్యు • నందనునకు
నర్థమగుఁ బరిక్షిన్నాను • మనియెఁ గృష్ణుఁ
డఖిలజనములు వినఁ గౌర • వాధినాథ.

మఱియుఁ గొంద ఱీబాలుఁడు గర్భస్థుఁడై యున్నకాలమునను శ్రీకృష్ణుఁ డశ్వత్థామప్రయుక్తాస్త్రవహ్నిచేఁ గాల్పఁ బడుననని యిప్పాలు నంగుష్ఠమాత్రపురుషుండై యుత్తరాగర్భముఁజొచ్చి గదచే నస్త్రము నణఁచి రక్షించెననియు, బాలుఁడు పుట్టినతోడనే గర్భమునఁగాచిన యాశ్రీకృష్ణునికై నలుదిక్కులఁ బరీక్షించెను గానఁ బరీక్షిత్తుఁ డయ్యెననియుఁ జెప్పుదురు. అందువలన నితనిఁ బరిక్షిత్తనియు, బరీక్షిత్తనియు రెండువిధములఁ బిలుతురు.

ప్రాణములు సమకొనిన వెంటనే ప్రపౌత్రుఁడని కుంతియుఁ బౌత్రుఁడని ద్రౌపదీసుభద్రలును, మేనల్లుని తన

యుఁడని కృష్ణబలదేవాదులును దౌహిత్రుండని మాత్స్యులును రత్నాభరణాదుల నలంకరించిరి. ఒక్క యుత్తరయేకాక కుంతీ సుభద్రలుగూడ నీబాలు నల్లారుముద్దుగఁ బెంచుచు ముగ్గురు తల్లుల ముద్దుబిడ్డఁగాఁ జేసికొనిరి.

---

## తృ తీ యా ను వా క ము.

ధర్మజుఁ డశ్వమేధయాగముఁజేయ నుద్యుక్తుఁ డగుట.

మున్ను మరుత్తరాడ్యజ్ఞదత్త దక్షిణాధన మపారమగుటచే, విప్రులు దాని ననుభవింప శక్తిలేమిని హిమాలయోత్తర భాగమున నేకమనస్కులై దీని నెవ్వరు దెలిసికొనిన వారిద యగుంగాక యని నిక్షేపముఁజేసిన యపారధనమును, పాండవులు వ్యాసోపదిష్టవిధిచేఁ ద్రవ్వించి, యసంఖ్యాకంబులగు వేసడంబులపై, వృషభంబులపై, గుఱ్ఱంబులపై, బండ్లపై, మోయించికొనుచు, పరిక్షిజ్జన్మవార్తను, శ్రీకృష్ణాగమనవార్తను, శ్రీకృష్ణుఁ డు పరిక్షిత్తును బ్రతికించినవార్తను, మధ్యేమార్గంబున నాలించి యపారానంద సాగరమున నోలలాడుచు, హస్తిపురి పరిసరంబునఁ గృష్ణాదులచే నెదుర్కొనఁబడి బరిక్షిత్తు జనియించిన నెల దినములకు శుభసమయంబునఁ బురిం బ్రవేశించి, ధృతరాష్ట్రాది కురువృద్ధుల కానంద మెసఁగ నందనపురస్సరంబుగ ధనలాభ పాత్రలాభానందవార్తల వారికి విన్నవించిరి. అంతఁ గృష్ణద్వైపాయనుఁ డేతెంచి ధర్మజునిచే నుచిత సత్కారంబుల నొంది, ధర్మ

నందనా ! నీకు గురువును, బ్రాహ్మణుఁడును నగు ద్రోణు నసత్య మాడి కామకృతబ్రహ్మహత్యకుఁ గారణభూతుఁడనైతివనియుఁ బితామహుఁడగు భీష్ముని, సోదరుఁడగు కర్ణుని వధించుటకుఁ గారణభూతుఁడనై జ్ఞానాజ్ఞానకృతదోషములఁ జేసితి వనియు, జ్ఞాతులగు భూరిశ్రవస్సోమదత్త బాహ్లికాదులను దుర్యోధనాదులను జంపించుటకు హేతుభూతుఁడనైతివనియు, నీకు మనోవ్యథ మిక్కుటముగా నున్నది. నీసోదరులు నట్టి విచారమునే పొందుచున్నారు. ద్రోణవధమునకుఁ బ్రత్యేక మొక యశ్వమేధమును, జ్ఞాతి బాంధవ మిత్రాదుల వధములకు వేఱొక యశ్వమేధమును, నింతటి యుద్ధమైనను, నీసామ్రాజ్య మంగీకరింపని పరరాష్ట్రాధిపుల నదిమి కప్పములఁ గొని సమ్రాట్టువను ఖ్యాతి నొందుటకు మఱియొక యశ్వమేధమును, మొత్తమున మూఁడశ్వమేధములఁ జేయవలసియున్నది. దీనికి వేద మిట్లు విధమునఁ దెల్పుచున్నది. వినుము.

(1) "ఎవ్వఁ డశ్వమేధమును జేయునో యాతఁడు బ్రహ్మహత్యాదోషమునుండి తరించును; తరించును."

(2) "ఎవఁ డశ్వమేధయాగముఁ జేయునో యాతఁ

(1) "తరతి తరతి బ్రహ్మహత్యాం యోశ్వమేధేన యజతే" కృష్ణయజుర్వేద॥

(2) "యోశ్వమేధేన యజతే సర్వ ఏవ భవతి సర్వస్య వా ఏషా ప్రాయశ్చిత్తిః సర్వస్య భేషజగ్ం సర్వంవా ఏతేనపాప్మానం దేవా అతరన్నపి వా ఏతేన బ్రాహ్మహత్యామతరం త్సర్వం పాప్మానం." కృష్ణయజుర్వేద॥

డన్ని సత్కర్మములను జేసినవాఁడె యగును. అన్ని పాపములకు నిదియే ప్రాయశ్చిత్తము. సమస్త మనోరోగములకు నిదియె దివ్యౌషధము. ఈయజ్ఞముచేతనే దేవతలు సర్వపాపములను బోఁగొట్టుకొనిరి. ఇంతమాత్రమె కాదు. దీనిచేతనె దేవతలు బ్రహ్మహత్యనుగూడఁ బోఁగొట్టుకొనిరి."

అందువలన సకలజ్ఞాతివధమహాదోషమే కాక ద్రోణ వధమునకుఁ జేయదగు ప్రాయశ్చిత్తముఁగూడ నీవు చేసికొనిన వాఁడ వగుదువు.

(1) "ఏవఁడు రాష్ట్రాక్రమణముఁజేయునో వాఁ డశ్వమేధముఁ జేయు" నని కలదు. నీవింతటి సమరమున జయము నొందినను, ప్రాఁ బగల మనములఁ బెట్టుకొని ప్రాగ్దిశయందుఁ బ్రాగ్జ్యోతిషాధిపుఁడును భగదత్తుని సుతుఁడు నగు వజ్రుఁడును, మీపక్షముననె పోరి యుద్ధమున వీరమరణమునొందిన మగధేశుండగు సహదేవునిసుతుఁడు మార్జారి తనతాతయగు జరాసంధ పక్షాభిమాని యగుట నాతండును, దక్షిణదిశను, త్రిగర్తలును, దశార్ణదేశాధీశుఁ డగు చిత్రరథుండును, పశ్చిమమున సైంధవుని జ్ఞాతులును, నిషాదదేశంబున 'ఏకలవ్య' సుతుండును, పశ్చిమోత్తరభాగంబున గాంధారరాజగు శకునిసుతుండును, నీసామ్రాజ్య మంగీకరింపక ధిక్కరించుచున్నారు. వారల నోడించి సామ్రాజ్యము నిల్పుకొనుటకై మూఁడవయశ్వమేధ మవసర

(1) యో రాష్ట్రం క్రామతి సోశ్వమేధేన యజతే. కృష్ణయజుర్వేద॥

మనిన యుధిష్ఠిరుఁడు 'ఓమహానుభావా! నే నశ్వమేధము చేయు టచే నాపాతకములు నశించును గాని తక్కిన నాసోదరుల యొక్కయు, సాత్యక్యాదులయొక్కయుఁ బాతకము లెట్లు తొలఁగునో యానతీయవే' యన నప్పారాశర్యుం డిట్లనియె. యుధిష్ఠిరా! అందఱు నశ్వమేధము చేయనక్కఱలేదు. * అశ్వమేధయాగమున, అవభృథస్నానముఁజేసిన నందఱకును బ్రహ్మహత్యాదోషము తొలఁగు నని, ధర్మశాస్త్రమునఁ గలదు. కావున నీవు భూరిదక్షిణలతో ముఖ్యముగా మూఁడశ్వమేధములను జేయుమన, ముకుందుండును దగినతెఱంగున ముచ్చటింప, ధర్మజుఁడు వల్లెయనె. ద్వైపాయనుఁడు రాఁబోవు చైత్రశుద్ధపూర్ణిమనాఁడు సంకల్పముఁజేసి యశ్వమును భూప్రదక్షిణమునకై విడువు మన నయ్యుధిష్ఠిరుండుం దగినవారలఁ దన యశ్వములలో నశ్వమేధోచితమగు దాని నేఱుఁ డన వారట్టి యశ్వము నేటి ముందు నిలుప సంతసిల్లి యది పారాశర్యున కెఱుకపఱిచి యధ్వర్వ్యాదుల నేర్పఱుపఁగోరెను. అందుల కాకృష్ణద్వైపాయనుండు కర్మమీమాంసాశాస్త్రకర్త యగు జైమినికిఁ బ్రియశిష్యుం డయిన యాజ్ఞవల్క్యు నధ్వర్యునిగాను, తన శిష్యులగు పైలాదులఁ దక్కినఋత్విజులనుగాను నేర్పఱుప నయ్యాజ్ఞవల్క్యుండు శ్రౌతవిధులఁ దెలిసిన తనశిష్యు నొక్కరు మేధీయాశ్వముతో భూవల

* సూ॥ అశ్వమేధినంవా వభృథ మేవావేత్యా ముచ్యతే॥ ఆపస్తంబ ధర్మసూత్ర॥

యముఁ బుట్టివచ్చునపు డయ్యెయెడలఁ జేయఁదగు కర్మకలాపంబుల నిర్వర్తింప నియోగించెను. అశ్వరక్షణమున కర్జునుఁడె యర్హుఁడని కృష్ణాదులు తలఁచుటచే ధర్మజుఁ డాపార్థుచే ననిపించుకొని నియోగించి భీమ నకులుల రాష్ట్రరక్షణమునకును, యజ్ఞార్థవస్తుసంపాదనమునకై సహదేవుని నియమించి, తాను ద్రౌపదీసమేతుండై గాంధారీ ధృతరాష్ట్రులచేతను, కుంతిచేతను, విదురుచేతను ననుజ్ఞాతుండై శుభముహూర్తంబున స్వస్తివాచనపూర్వకంబుగా దీక్షితుండయ్యె.

---

## చతుర్థానువాకము.

### అర్జున దిగ్విజయము.

పౌత్రలాభ ముదితుఁడగుటను, పార్థుండు కౌంతి పుత్రశోకాపనోదము సేసికొని పౌత్రుని బాల్యచేష్టలఁ గాంచి యానందించుటకు విఘ్నకారియై యశ్వమేధాశ్వరక్షణ మొందు సంప్రాప్తంబగుడు విధ్యర్థంబుఁ గైకొని జయజయధ్వానంబులు మిన్నుముట్టఁ బ్రజలు నుతింప నయ్యశ్వంబువెంటఁ బ్రయాణమయ్యెను.

అప్పు డయ్యజాతశత్రుఁ డర్జునుం గాంచి "అర్జునా! మహాయుద్ధమున జనసంక్షయమయ్యె. వీరాధివీరులు మడిసిరి. భూమి నిర్వీర్యయయ్యె. కొలఁది వీరులుండినను వారు బాలురు;

క్షీరకంకలు; పడమఁదనమున నెవ్వరేని నిన్నెదిరించినను తొలుత దండోపాయ మూనక సామాదికము వేతనే కార్యముఁ జక్కఁ బఱుపుము. కార్యము గానియపుడు యుద్ధముఁ జేయు " మని బోధించి యాశీర్వదించి పంపె.

అద్విజయుండును, యాజ్ఞవల్క్యశిష్యుం డశ్వమేధాశ్వము ఖాదము సేయునపుడు, నిలుచునపుడు, నీరుఁద్రావునపుడు, విశ్రమించునపుడు, మూత్రించునపుడు, చేయువిధులను విధ్యుక్తముగ నెఱవేర్పుచుండఁగా దిగ్విజయమునకు వెడలెను. రుక్మపట్టమును ధరించి ధాన్యాదియై వచ్చుని పూలదండవలె సాగుచుండిన యయ్యశ్వము చూపఱకు నింపుగ నుండెను. (1)అశ్వసంరక్షణమునకై పురోగాములై కవచములఁ దొడిగి కవదొనలఁ బూని నూర్వురు రాజపుత్త్రిలును, నూర్వురు రాజన్యులును, నిరుపార్శ్వంబులను నిషంగములు గలిగిన నూర్వురు సూతపుత్త్రిలు, నందఱు గ్రామాధికారుల పుత్త్రిలును, శతసంఖ్యాకులగు కరగ్రాహుల పుత్త్రిలును, వందమంది దండధారులును, దృఢాంగులగు నశ్వసైనికులును, నశ్వమేధాశ్వముం బలిపి రక్షించుచుండిరి.

ఆ యశ్వము భూప్రదక్షిణముగఁ బోయి (2) ప్రాగ్జ్యో

---

(1) శతపథబ్రాహ్మణ ఐతరేయ బ్రాహ్మణములనుండి యీయంశములు గ్రహింపఁబడెను.

(2) ఇప్పటి అస్సాము పూర్వము ప్రాగ్జ్యోతిషము.

తిపముఁ జొచ్చెను. తత్పురాధీశుఁడగు వజ్రదత్తుఁడు (భగదత్తుని పుత్త్రుఁడు) భగదత్తు నర్జునుఁడు సుప్రతీకముతోఁగూడ మహా యుద్ధమునఁ జంపెనను పగ మనంబున నంటియుంటయు, యౌవనగర్వంబు దన్నుఁ బురిగొల్పుటయుఁ గారణంబులుగా వాఁడా సైన్యము నెదిరించి మేధాశ్వముం బంధించెను. అర్జునుఁ డన్నయానతిచే సామవాక్యము లెన్ని చెప్పిన నాతఁ డాలకింపనందున మహాజన్య ముభయులకును మూఁడునాళ్లయ్యెను. నాలవనాఁ డర్జునుఁడు వజ్రదత్తు మహాగజమును నేలఁ గూల్చి యాతని నలయించి 'జితోఽస్మి' యనిపించి సాదరముగ నాతని నశ్వమేధమున కాహ్వానించెను. పిమ్మట నయ్యశ్వము రాజగృహ పట్టణ పరిసరమునం బరిభ్రమింప జరాసంధపౌత్రుండును మాగధేశుండును నగు మార్జారి, తనతండ్రి సహదేవుఁడు పాండవ పక్షపాతి యైనను, పితామహునియందలి యభిమానముచేతను, పడుచుఁదనమునకుఁ బరిపాటియగు గర్వముచేతను నర్జును నెదిరించి ఘోరరణ మొనర్చి యోడి విజయునకు విజయము నిచ్చెను. పిమ్మట నాతనిచే నాహూతుఁడై ధర్మజు నశ్వమేధమునకు వచ్చెద ననెను. తరువాత నాయశ్వ మర్జునుఁడు వెన్నాడ ఉత్కల కళింగ గాంధర చోళాది దేశముల నిరాతంకముగ నిర్గమించి ద్రావిడదేశమునకుఁ జరలెను. అట, మణిపూరు పురాధీశుండును, చిత్రాంగదార్జునులకు జన్మించి మాతామహుండగు మలయధ్వజునకు దత్తుఁడైన బభ్రువాహనుం డర్జును రాక దా

దన్నాల విని పితృభక్తి పురస్సరంబుగ నెదుర్కొని గౌరవించెను.

అయ్యర్జునుండును, భీష్ము నన్యాయంబుగ శిఖండి నెపంబునఁ దాఁ జంపినందులకుఁ దనపైఁ గినిసి వసువులు గంగాదేవి యనుమతిఁ గొని తన్నుఁ జెడ శపింపఁ దచ్ఛాపమహిమ ప్రేరేచుటచే, బభ్రువాహనునిఁ జూచి యిట్లనియె. "నీవు క్షత్రియునకుఁ బుట్టినవాఁడ వైతేని యాగాశ్వము బంధింపక విడిచెదవే" అని నిందింప నాతం డేమియు మాఱువలుకనేరక పురికి మఱలి వచ్చుచుండఁ బుట్టుబుట్టువువానికూఁతురును, అర్జునుభార్యయు నగు, ఉలూపి బభ్రువాహనునకుఁ గాన్పించి, తన్ను సాపత్నిగా నెఱింగించుకొని యర్జునుతో బభ్రువాహనుని సమరమునకుఁ బురికొల్పెను.

బభ్రువాహనుఁడును నేను క్షత్రియుఁడన యని యర్జును నెదిరించి ఘోరరణము గావించి యర్జునాస్త్రములచేఁ దాను మూర్ఛమునుంగులోన, తనయస్త్రములచేఁ బార్థుండును నగము చచ్చునట్లు చేసెను. పిమ్మట నులూపి సంజీవమణిం దెచ్చి నేద దేఱిన బభ్రువాహనునిచే నర్జునునెదపై నుంచింపనంతలో నర్జునుండును నిద్దురనుండి లేచినవానివలె లేచి యులూపిచే యావచ్ఛాపవృత్తాంతమును విని యానందించి యులూపీ చిత్రాంగదా బభ్రువాహనుల నగ్గించి వారల నశ్వమేధయాగమున కాహ్వానము చేసి పశ్చిమాభిముఖుండై యజ్ఞాశ్వమును వెన్నంటిపోయెను.

అట్లు పోయి పోయి యాతఁడు త్రిగర్తదేశముఁ

జొచ్చెను. త్రిగర్తులకు నర్జునునకు నెడతెగని వైరము గలదు. *త్రిగర్తాధీశుఁడగు సుశర్మ కురుక్షేత్రసంగ్రామమునఁ బదునెని మిదిదినములు ససైన్యసోదరుఁడై ఘోరముగఁ బోరి యర్జునుని చేతనె మృతినొందెను. భారతయుద్ధమున శ్రీకృష్ణునంతటి మహా నుభావునిసయితము సంశప్తకులచే నర్జునుఁ డేమయ్యెనో యని కంట నీరు వెట్టునట్లు చేయఁగలిగిన శూరులగు త్రిగర్తదేశీయు లశ్వముతో నర్జునుఁ డేతెంచెనని విని యూరకుందురా? తమ పితృభ్రాతాదు లర్జునుచేఁ జచ్చిన పగను మఱతురా? అశ్వ మును బంధించి ఘోరసమరమునకు గడంగిరి. అర్జునుం డజాత శత్రుని సందేశము నెఱింగించినను, పితృపితామహాదుల మరణా మర్షణ మెదల మెఱుగుచుండుటచేఁ దిగ్ర్తనివాసులు సూర్య వర్మ యను రాజుం బురస్కరించుకొని యర్జునుపైఁ గవిసిరి. ఆసూర్యవర్మయు నాతనిసోదరులు కేతువర్మ ధృతవర్మలును వెనుదీయక పోర నతఁడు కరుణ పెంపున వారికి నొవ్వడరకుండ యుద్ధము చేయుటచే నది బలహీనతగా నెంచి ధృతవర్మ యర్జును గాండీవము చేతనుండి పడునట్లు నేసి యాతనికిఁ గోపముఁ దెప్పిం చెను. పిమ్మట నాతనిచే నేటులువడి సోదరసైన్యసహితముగాఁ బరువిడఁ గొందఱు త్రిగర్తులు నర్జును శరణు సొచ్చిరి. అందుల

* త్రిగర్తదేశము రాజపుత్రస్థానములోని కొంతభాగము. త్రి + గర్త=త్రిగర్త. గర్తమన గొయ్యి. "సాంబరు, సరు, డిడ్వానా" యను సరస్సులుగల ప్రదేశమే త్రిగర్తదేశమ్ము కావచ్చును.

కాతండు వారలఁ గాంచి కాచితి నని వారల నధ్వరమున కాహ్వా
నముసేసి సింధుదేశము నశ్వానుయాయియై ప్రవేశించెను.

అన్యాయకృతములగు సైంధవ తత్పితృవధములచే నెదలు
విషాదకలితంబులగుడు సైంధవులు సైంధవపుత్రుం బురస్క-
రించుకొని సైంధవసమేతుఁడగు సైంధవారి నరికట్టిరి. అర్జునుం
డును నయవాక్యంబుల వారిం దేర్పఁ జూచినను వారు కలఁకఁ
దేలక యలుక మెయి నలుఁగుల నాతని ముంచిరి. ఫల్గునుండును
నఫల్గుబాణంబుల సైంధవులను ముంప నాయంప వెల్లిచేఁ బటా
పంచలగు సైంధవపుఁ బటాలంబులఁ జూచి సైంధవసూనుఁడు
భీతిచే నంతఃపురంబుచేరి హృదయ మవిసి యంతకపురి కరిగెను.

పతిపుత్త్రమరణంబులచే మహాశోకాంబుధినిమగ్న
మగు 'దుస్సల' బాలపౌత్త్రుఁ జేతుల నుంచుకొని వైధవ్యాపా
దకుఁడగు నర్జునుపాదంబులపైఁ బడి నిర్వంశము కాకుండఁగ నీని
కుఁగు నీపౌత్త్రుంబోలె రక్షింపు మన నర్జునుండు, తోడంబుట్టు
వునైన దయతలఁపక వైధవ్యయుక్తంబుగాఁ జేయు క్షత్త్రధర్మ
ము నెద నసహ్యించుకొనుచు "సోదరీ! నీపౌత్త్రుఁడు నాపౌత్త్రు
నట్టివాఁడు. నామేనల్లుఁడే" డన, దుస్సల దుఃఖాతిరేకంబుతో
నాతనిదుర్మరణంబు విన్నవింప నాతం డెదురు శోకించి యామె
నోదార్చి యభయ మొసఁగి మంత్రిపురోహిత దండనాథాదులఁ
బిలిపించి సైంధవపౌత్త్రుని సింధుదేశసింహాసనమునం దునిచి

యీతండ యీదేశాధీశుండని యతని కభిషేచనముఁజేసి తన కరుణాళుతఁ జూపెను.

పిదప సింధువిషయంబు నతిక్రమించి శ్వేతవాహనుండు పంచనద విషయంబుఁ జొచ్చువాఁడు కట్టెదుర (1) "నిషాదస్థపతియు," నిషాద సైన్యముతోఁగూడినవాఁడు నగు, ఏకలవ్య పుత్రుతో మహాహవము సేయవలసివచ్చె. ఏకలవ్యునకు నర్జునునకు విద్యాభ్యాసనమయమునుండియు వైరము గలదు. గురుదక్షిణ యనెడు నెపమున ద్రోణుఁ డేకలవ్యునంగుష్ఠము గొట్టించుటకుఁ గారకుఁ డర్జునుఁడె. శ్రీకృష్ణుఁడు జరాసంధునితోఁ బోరునపుడు జరాసంధపక్షమున వచ్చిన యేకలవ్యు నంతకపురి కంపెను. కురుక్షేత్రయుద్ధమున నేకలవ్యపుత్రుని కేకారణముననో ప్రవేశము గలుగలేదు. *సైంధవవధమునాఁటి మహారణము నిషాదదేశముననే యయ్యె. పైకారణములచే నేకలవ్యపుత్రుఁ డర్జునుహితోపదేశము వినక యెదుర్కొని యాతనితో ఘోర సంగ్రామముఁజేసి యోడి శరణన నాతఁడు నిషాదస్థపతిం గాచి విడిచి యశ్వముతో గాంధారవిషయముఁ జొచ్చెను.

గాంధారరాజగు శకుని యాలోచనావిశేషమె కురుపాండవభేదహేతువు, లోకోపద్రవకర హేతువుగూడ నయ్యెను.

---

(1) నిషాదులకు రాజు (లేక) నిషాదుఁడైన రాజు. మఱియు నిషాదుఁడు రాజుగాఁ గలవాఁడు; అనునర్థములు చెప్పవచ్చును. బహువ్రీహి యిటఁ బొసఁగదు.

* ఈవృత్తాంతము సంస్కృతభారతమునఁ గలదు.

పాండవుల కపకృతిఁ జేసినవారిలో నగ్రగణ్యుఁడు శకునియె. కౌర వానీకములోఁ గడవటఁ బోరినముఖ్యులు గాంధారాశ్వికులె. సహదేవాదులు సంపూర్తిగ యుద్ధరంగగతులగు గాంధారుల నున్మూలించిరి.

అట్టి రణహతసైనికుల బంధువు లర్జుననామమాత్రశ్రవణమునసే కినిసి కడవటఁ బోరాడ శపథములు పూని విన్వచ్చు సాంత్వనోక్తులను వినక, అతనిని వివిధాయుధముల వేధింప, విజయుండును వివిధాస్త్రములఁ బ్రయోగించి విజితులఁజేసి విజయంబుసేకొనియె. గాంధారరాజపౌత్రుని గాంధారీదేవి జ్ఞప్తికిరాఁ గరుణించి యామండలమున కభిషిక్తుఁజేసెను. తదనంతరము కాశ్మీరమున కేఁగి బాలుఁడగు నోనందు నాదరించె. ద్వారక నుండియే శుభాగమనవార్త నన్ను కెఱుక పఱచుటచేఁ దనరాక కెదురుచూచు బంధుమిత్రాదులానందపరవశులు, ప్రేమాంతరంగులు నగునటులు చేయుచు విజయుండు విజయంబుఁ సేకొని క్షతావయవంబులతో — బడలిన యొడలితో—ఉఁతకాఁడొడ్డు నేరినరీతి సంతసిల్లుచు, మాఘమాసాంతమునకె యశ్వముతో యాగశాల కేతెంచెను. ధర్మజుండును ఋత్విక్పురోహితామాత్యులతోడను, విదురాదులతోడను నాతని నెదుర్కొని యాతని నమస్కృతు లందుకొని యాశీర్వదించి యాదరించెను.

## పంచమానువాకము.



### అశ్వమేధము.

అంతం జైత్రిపూర్ణిమ యాసన్నంబగుడు ఋత్విగ్గ్రేస రుండగు ద్వైపాయనుండు సర్వఋత్విగనుమతిని, కార్తాంతికనిర్ణీతాసన్నముహూర్తము ధర్మజున కెఱిగించి శాలాప్రవేశమున కాతని ద్వరపెట్టెను. ధర్మజుఁడును, పవనజునాననం బాలోకించి "శిల్పులను రావించి యాగానీతరాజన్యవరులకు, ఋషివర్యులకు, తక్కుచాతుర్వర్ణ్యులకుఁ దగిన వసతుల నేర్పఱుపు"మని తాను శాలాప్రవేశ మొనర్చెను. భీముఁడు పలశాలలను, పర్ణశాలలను, నిర్మింపఁజేసి, రాజన్యులను, తదితరులను విడియించి భోజ్యంబులను, చతుర్విధాన్నంబులను, ఖాద్యంబులను, పేయంబులను, పుష్కలంబుగఁ దృప్తిని గలిగించెను. లక్షజనులు భుజింప నొక్కపరిమోగఁగు నొకఘంట నేర్పఱుప నది యాగాది నుండి యాగాంతమువఱ కన్నిదినములు నేకగతిఁ దెఱపిలేకుండ మ్రోగుచునే యుండెను. ఎన్నిలక్షలజనులు భుజించి తృప్తినొం దిరో లెక్కింప నశక్య మయ్యెను. యాగము దర్శింప నేతెంచిన 'గోనంద, బభ్రువాహన, వజ్రదత్త, మార్జార్యాది, మూర్ధాభిషిక్తులను, శ్రీకృష్ణబలరామ సాత్యక్యాదులను, కవలఁగూడి కరువలి తనయుం డగ్రజు ననుమతిం బెక్కువిధంబుల గౌరవించెను. ఆయాగమునకు వచ్చినవారిలో 'అభోజ్యుఁడు, అనలంకృతుఁడు,

అసంతృప్తుఁడు, అసన్మానీ, యొక్కఁడైన లేకుండెను. మీకేమి కావలయునో మొగమోటము లేకుండ నడిగి యర్థముం బొందుఁ డని భీముఁ డర్థులకుఁ బ్రోత్సాహ మొనరించుచుండెను. అట్టి యెడ ధర్మరాజు "ద్విసహస్రికనక్షేష్టికలచే నేర్పఱుపఁబడి, శ్యేనాకృతిని, చతుశ్చిత్యమును, గలిగి పదునెనిమిదిచేతుల పరిమితి గల వేదికతోఁ" యజనంబొనర్చె; అచతుర్వేదియు, అషడంగ వేత్తయు, అదేవగురుతుల్యుఁడు నగు ఋత్విక్కొక్కఁడును నందు లేకుండుటచే సప్రాయశ్చిత్తముగా, ప్రవర్గ్యములు, సవనములు, యథావిధిగ నిర్వర్తించిరి. అందు 'ఖాదిర, బైదిల, పాలాశ, దేవదారు, శ్లేష్మాతక' శాఖా కల్పితంబులగు యూపంబులు విధ్యుక్తంబుగ నిరువదియొక్కటి నిర్మింపఁబడి, అందం దందంబుగఁ గనకయూపంబులు కొన్ని నిలుపఁబడెను. వ్యాసపరిరక్షితంబును, శాస్త్రోక్తతురగ సదృశంబును నగు వాజి, వాజిమేధ వాటికాప్రవేశంబు నొందఁ, వచ్చినప్రజలందఱు నాయశ్వమును దర్శకుఁడగు నర్జునుశౌర్యవిక్రమాదులను వేనోళ్ళం బొగడిరి. అయ్యది యూపంబునకు గట్టంబడి త్రిశతపరిమితిగల చతుష్పాత్తులు, ఖచరములు, జలచరములు, యథావిధిని జట్టును నిలుప విరాజిల్లెను. యాజకులు యథావిధిని, కార్యకలాపంబులు పారాశర్యునానతిచే నిర్వర్తించిరి. అధ్వర్యుఁ డశ్వవిశసనకాలమునకు యాజ్ఞసేనిని రావించి యామెచే నశ్వమునకుఁ బరిచర్య చేయించి శస్త్రప్రహతంబులును, యుక్తంబులు నగు నశ్వాంగంబుల నామెచే

హోమంబుఁ జేయించె. తక్కినయవయవంబులను ఋత్విక్కులు వేల్చిరి. వపాహోమముచే బయలువెడలు పరిమళము నాఘ్రాణించి ధర్మజుఁడు నాతనిసోదరులు దక్కంగలజనులు తమసర్వ పాపంబులు పరిహరింపబడినవని సంతసించిరి. సమస్తజనులు సమ్మోదహర్షధ్వనులఁ జెలంగ ధర్మజుఁడు సదస్యులకుఁ గోటివేల నిష్కముల నిచ్చె. ఋత్విగగ్రేసరుఁడగు వేదవ్యాసునకుఁ దన సామ్రాజ్యము నంతయు దక్షిణగా నీయనుంకింపఁ బారాశర్యుఁ డిట్లనియె. "రాజా! నీయీయాగమున కధ్వర్యుండగు యాజ్ఞవల్క్యగురువు జైమినిమహర్షి. ఆతఁడు వేదోదితంబులగు కర్మములకు నిదానంబగు తన పూర్వమీమాంసాశాస్త్రమున నిట్లు చెప్పి యున్నాఁడు. (i) "రాజు రాజ్యమును దాన మిచ్చుట కర్హుఁడు కాఁడు. అది సర్వజనులకు సమానముగ ననుభవింపదగినది అనెను. తత్సూత్రభాష్యకర్తయగు, శబరమహర్షియు (ii) "సార్వభౌమున కన్నిటినిదానముచేయుట కధికారముగలదా?

---

(i) నభూమిస్స్యాత్సర్వాన్ప్రత్యవశిష్టత్వాత్. పూర్వమీమాంస 6-7-3.

(ii) అత్రైవసర్వదానే సంశయః. కింభూమిర్దేయా? నఇతి. కాపునర్భూమి రత్రాభిప్రేతా. యదేత న్మృదారబ్ధం ద్రవ్యాంతరం పృథివీగోలకం న క్షేత్రమాత్రం. మృత్తికావా. తత్ర కింప్రాప్తం, అవిశేషాద్దేయా ప్రభుత్వసంబంధేనహి. తత్ర స్వశబ్దో. నర్తతే శక్యతేచ మానసవ్యాపారేణ స్వస్య స్వతా నివర్తయితుమితి. ఏవం ప్రాప్తే బ్రూమః. నభూమి ర్దేయా ఇతి; కుతః క్షేత్రాణా మిశతాగో మనుష్యా దృశ్యంతే. నకృత్స్నస్య పృథివీగోలకస్యఇతి అహ, య ఇదానీం సార్వభౌమః సతర్హి దాస్యతి. సోపి న

అనంతృప్తుఁడు, అసన్మాని, యొక్కఁడైన లేకుండెను. విూకేమి కావలయునో మోమోటము లేకుండ నడిగి యర్థముం బొందుఁడని భీముఁ డర్థులకుఁ బ్రోత్సాహ మొనరించుచుండెను. అట్టియెడ ధర్మజుండు "ద్విసహస్రికసక్తేష్టికలచే నేర్పఱుపఁబడి, శ్యేనాకృతిని, చతుశ్చిత్యమును, గలిగి పదునెనిమిదిచేతులు పరిమితిగల వేదికతో" యజనంబొనర్చె; ఆచతుర్వేదియు, అషడంగవేత్తయు, అదేవగురుతుల్యుఁడు నగు బుద్ధిశాలి యొక్కండును నందు లేకుండుటచే సప్రాయశ్చిత్తముగా, సవర్గ్యములు, సవనములు, యథావిధిగ నిర్వర్తించిరి. అందు 'ఖాదిర, బైదిల, పాలాశ, దేవదారు, శ్లేష్మాతక'శాఖా కల్పితంబులగు యూపంబులు విధ్యుక్తంబుగ నిరువదియొక్కటి నిర్మింపఁబడి, అందం దందంబుగఁ గనకయూపంబులు కొన్ని నిలుపఁబడెను. వాసపరిక్షితంబును, వాజ్రోప్వతితురగ సదృశంబును నగు వాజి, వాజిమేధవాటికాప్రవేశంబు నొంద, వచ్చినపరిజనులందఱు నాయశ్వమును దక్షిణకుఁడగు నర్జునుశౌర్యపరాక్రమాదులను వేనోళ్ళం బొగడిరి. అయ్యది యూపంబునకు గట్టంబడి త్రిశతపరిమితిగల చతుష్పాత్తులు, ఖచరములు, జలచరములు, యథావిధిని జట్టును నిలుప విరాజిల్లెను. యాజకులు యథావిధిని, కార్యకలాపంబులు పారాశర్యునానతిచే నిర్వర్తించిరి. అధ్వర్యుఁ డశ్వవిశసన కాలమునకు యాజ్ఞసేనిని రావించి యామెచే నశ్వమునకుఁ బరిచర్య చేయించి శస్త్రప్రహాతంబులును, యుక్తంబులు నగు నశ్వాంగంబుల నామెచే

హోమంబుఁ జేయించె. తక్కినయవయవంబులను ఋత్విక్కులు వేల్చిరి. వపాహోమముచే బయలువెడలు పరిమళము నాఘ్రాణించి ధర్మజుఁడు నాతనిసోదరులు దక్కంగలజనులు తమసర్వ పాపంబులు పరిహరింపబడినవని సంతసించిరి. సమస్తజనులు సమ్మోదహర్షధ్వనులఁ జెలంగ ధర్మజుఁడు సదస్యులకుఁ గోటివేల నిష్కముల నిచ్చె. ఋత్విగ్గ్రేసరుఁడగు వేదవ్యాసునకుఁ దన సామ్రాజ్యము నంతయు దక్షిణగా నీయనుంకింపఁ బారాశర్యుఁ డిట్లనియె. "రాజా! నీయీయాగమున కధ్వర్యుండగు యాజ్ఞవల్క్యగురువు జైమినిమహర్షి. ఆతఁడు వేదోదితంబులగు కర్మములకు నిదానంబగు తన పూర్వమీమాంసాశాస్త్రమున నిట్లు చెప్పి యున్నాఁడు. (i) "రాజు రాజ్యమును దాన మిచ్చుట కర్హుఁడు కాడు. అది సర్వజనులకు సమానముగ ననుభవింప దగినది అనెను. తత్సూత్రభాష్యకర్తయగు, శబరమహర్షియు (ii) "సార్వభౌమున కన్నిటినిదానముచేయుట కధికారముగలదా?

---

(i) నభూమిస్స్యాత్సర్వాన్ప్రత్యవశిష్టత్వాత్. పూర్వమీమాంస 6-7-3.

(ii) అత్రైవసర్వదానే సంశయః. కింభూమిర్దేయా? నఇతి. కాపునర్భూమి రత్రాభిప్రేతా. యదేతత్ మృద్దారబ్ధం ద్రవ్యాంతరం పృథివీగోలకం న క్షేత్రమాత్రం. మృత్తికావా. తత్ర కింప్రాప్తం, అవిశేషాద్దేయా ప్రభుత్వసంబంధేవహి. తత్ర స్వశబ్దో. సర్వతే శక్యతేచ మానసవ్యాపారేణ స్వస్య స్వతా నివర్తయితుమితి. ఏవం ప్రాప్తే బ్రూమః. నభూమి ర్దేయా ఇతి; కుతః క్షేత్రాణా మిశతాగో మనుష్యా దృశ్యంతే. నకృత్స్నస్య పృథివీగోలకస్యఇతి ఆహ, య ఇదానీం సార్వభౌమః సభర్తా దాస్యతి. సోపి న

భూమి నీయవచ్చునా? యను ప్రశ్నములు కలుగ, కాదని చెప్పు చున్నాము. ఎట్టిభూమి? మట్టిమొదలు భూగోళమంతయు భూమియే. అందువలన నొక్క పొలముమాత్రమె కాదు. మట్టి మాత్రమె కాదు. (ఇంతకుముందు సార్వభౌముఁడు తనసర్వస్వము నీయవచ్చునని చెప్పితిమి.) దీనివలన నేమి ప్రాప్తించెను? ప్రభువునకు భూమియందు స్వత్వమున్నదిగాన తప్పక భూమి దాన మీయవచ్చునని ప్రాప్తించినది. సత్వత్యాగము మానసికముగా యుక్తమైనదియేగాని, భూమివిషయమై రాజునకు స్వత్వములేదని చెప్పుచున్నాము. ఎందువలన ననఁ బ్రతిక్షేత్రమునకును యజమానులు వేఱుగ నుందురు. అందువలనరాజు ప్రత్యేకముగాఁ బొలమునీయుట కర్హుఁడుకాఁడు; తనపృథివీభాగము నంతయు నన్యాధీనముఁజేయుట కర్హుఁడై యుండఁడు;సార్వభౌముఁ డెంతకాలము సార్వభౌమత్వ మనుభవించునో అంత కాలమె కాని, యాపై నతనికి భూమిపై నధికారములేదు. సార్వభౌమునకు భూమిపై విశేషించి మఱియొక యధికారమున్నది. వ్యవసాయకులు పండించినది శత్రువులుకొనిపోకుండఁ

---

ఇతి బ్రూమః కుతః యావతాభోగేన సార్వభౌమో భూమేరీష్టే, తావతా అస్యాపి నకశ్చిద్విశేషః సార్వభౌమత్వే సత్వే తదధికం యత అసౌ పృథివ్యాం సంభూతానాం వ్రీహ్యాదీనాం రక్షణేన నిర్దిష్టస్య కస్యచిద్భాగస్య ఈష్టే; నభూమేః. తన్నిర్దిష్టాశ్చ యేమనుష్యాః తదన్యత్సర్వప్రాణినాం ధారణ విక్రమణాది యద్భూమికృతం తత్రేశత్వం ప్రతి. నకశ్చిద్విశేషః తస్మాన్న భూమి ర్దేయా॥ శాబరభాష్య॥

గాపాడుటకై పండినపంటలో నిర్దిష్టభాగమున కధికారి. భూమి యం దుండిన ప్రాణిసమూహమునందు మనుష్యులకే భూమిపై నధికారము గలదు. అందువలన రాజు భూమిని దాన మిచ్చుట కర్హుఁడు కాఁడు." అని మైమాంసికమతముం జెప్పెను.

అపుడు ధర్మజుఁడు భూదానమే యన్నిదానములకంటె శ్రేష్ఠ మనియు, యాగదక్షిణకై భూదాన ముత్తమమనియు వింటి నన సాత్యవతేయుండు, రాజు భూమిని దానమిచ్చునెడల స్వార్జితమును, శత్రురాజులనుండి యుపరాధముగాఁ గొన్న గృహక్షేత్రాదులనే దాన మీయవలయు నని చెప్పెను. అంత నజాతశత్రుఁడు "సామ్రాజ్యము నంతయు మీకిచ్చి నేను వనమున మునివృత్తి నుండ మనస్సున సంకల్పించుకొంటిని; అట్టి మనఃప్రతిజ్ఞ నెటులు మానుదును. రాజునకుఁ బ్రతిజ్ఞానిర్వహణ ముత్తమము కాదా?" అని పల్క ద్వైపాయనుఁడు సామ్రాజ్యము నాకిచ్చితివే యనుకొనుము, బ్రాహ్మణుఁ డేయుగమునను రాజ్యముసేయ నర్హుఁడు కాఁడు; కాన భవద్దత్తరాజ్యమునకుఁ దగినవెల నిర్ణయించి యాధనము దక్షిణగా నిమ్ము; కాదేని క్షణమాత్రసమ్రాట్టునగు నాయానతిలో నుండుజనుఁడ వగుటచే నాయాజ్ఞ ననుసరించి నీవే ప్రభుత్వము చేయు మన, వల్లె యని సామ్రాజ్యమును దారవోసి దానికిఁ దగినవెలగా ననేకకోటుల 'కుప్యసువర్ణము నకుప్యసువర్ణము'నిచ్చె. వ్యాసుఁడును, ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థాంతరములు గల ఋత్విక్కుల కంతటి

భాగములచే నాధనమును బంచి తనభాగమునకు వచ్చిన కుప్యాకుప్యదద్రవ్యమును స్నుషయగు కుంతి కిచ్చి సమునిబృందుఁడై వనంబున కరిగెను.

అధ్వరాహూతులగు దేశాధీశులు ధర్మజుచే సత్కృతులై తమదేశంబులకు సంతసంబున నరిగిరి. తక్కిన జనులుం దమ తమ నెలవులకు యాగనుత్యుపన్యాసంబు లొనర్చుచుఁ బోయిరి. బభ్రువాహనుండు హస్తిపురియందుఁ గొంతకాలముండి సోదర పుత్త్రుఁడగు పరిక్షీత్తు నెత్తి వసుద్ధాశి రత్నాభరణములచే నలంకరించి తల్లియగు చిత్రాంగదను, సాపత్ని యగునులూపిని నర్జునకడ నునిచి కుంతీసుభద్రాదులచే నాదరింపఁబడుచుఁ బిమ్మటఁ బాండ్యదేశమునకుఁ బాండవులచే ననుజ్ఞాతుండై వెడలెను.

---

## ప్ర స్థా ను వా క ము.

——:0:——

పరిక్షీత్తు బాల్యదశ, ధృతరాష్ట్రాదులమృతి.

అశ్వమేధాగతావనిపు లభిమన్యుపుత్త్రుం గనుఁగొని పితృపితామహాచిహ్నము లాతనియం దుండుటఁ జూచి యాతండహితభీకరుండును, హితహితంకరుండును, వంశోద్ధారకుండును నగు నని యానందించిరి. ఆపార్థపౌత్రుఁడు శుక్లపక్షపాకరుని

మాడ్కి దినదినప్రవర్ధమానుండై యేనవయేట నక్షరస్వీకృతి నొంది యచిరకాలముననే తగిన యుపాధ్యాయులతోడ విద్యలం గఱచి, ఉచితకాలంబున నుపనీతుండై, సాంగవేదవేదియై, రాజకుమారోచితవిద్యల నభ్యసించి, యుద్ధశాస్త్రమును పితామహగురువగు కృపాచార్యునుండి తత్త్వజ్ఞానముతో నభ్యసించి, శస్త్రశాస్త్రముల నొందుటచే శస్త్రియు, శాస్త్రియునై, ధర్మమును ధరించుటచే ధర్మియై, అశ్వాదియు గజాదియు నగుచుఁ బ్రజలకుఁ బ్రహ్లాదనమున శీతభానుండును, ప్రతాపమునఁ దపనుఁడునై, వేత్తలచే నదసత్తు లుపదేశింపఁ బడినను సత్తునందే దృష్టిగలవాఁడై యలరారుచుండెను. ప్రతివిద్యయు నుపదేశించుకాలంబున నొజ్జలు తామే ప్రత్యుపదేశంబులఁ బరిశిష్టుచే నొందితిమని తలఁచుచుండిరి. ఊనషోడశవర్షప్రాయమునఁ గాక పక్షశోభితమైన యాతనిమోము తమోభేది యగు రాకాశశివలెఁ దనరారెను. అతనిపితృమాతులాదుల యుద్ధవార్తలు, వారల దారుణమరణములు వినవిన నాతని హృదయమునఁ గరుణారస ముప్పొంగి పొరలుచు రణధర్మము గర్హింపఁబడు చుండెను.

యుద్ధాదినుండి పదుమూఁడేడులు నన నిదురుండు తీర్థయాత్రికై వెడలి మైత్రేయియు, కడ నేఁడాదికాలము తత్త్వజ్ఞానము నభ్యసించి యుద్ధాదిగఁ బదునేనేండ్లు పూర్తియగునాఁటికి గజపురిం జేరి ధృతరాష్ట్రునొద్ద నెప్పటివలె నుండెను.

రణనిహతసుత హితాదులకై వైచిత్రవీర్యుండు దుఃఖింపకుండఁగ యుధిష్ఠిరుఁ డెన్నేని యుపచారముల నాతనికిఁ జేయుచుండెను. యుద్ధమృతుల పారలౌకికక్రియలఁ జేయునపుడు ధృతరాష్ట్రుఁడు తలఁచినవానికంటె వేయిమడుంగులు దానధర్మంబులు సేయించియు, అగ్రహారములు, గ్రామములు, ఆరామములు మొదలగు వానిని నిర్మించునటులఁ జేయించియు, నిశ్చింతమనస్కుం జేయుచు నతనిక్షేమను సనారతము నిర్నిద్రుఁడై విచారించుచుండెను. ధనంజయుండును ధర్మజు ననుసరించుచుండెను. కుంతీద్రౌపదీసుభద్రలు సగౌరవమనస్కలై గాంధారీ ధృతరాష్ట్రులకు భోజన మజ్జనాదుల కేలోపము లేకుండఁ జేయించుచుండిరి. కవలు నట్ల సంచరించుచుండిరి. వారియెడ ధృతరాష్ట్రునకును బ్రేముడి యుండెఁగాని, భీముని గన్నపుడుమాత్రము పుత్రహంతకుఁ డని మనమున సక్రోధుఁ డగుచుండును. భీముండును నన్యసహితుండగు ధృతరాష్ట్రునెడ గౌరవయుక్తుఁ డగుచుండును గాని యెరును లేని సమయమునఁ బూర్వము ధృతరాష్ట్రుచేతను, ధార్తరాష్ట్రులచేతను దాము పడిన బన్నంబుల నుగ్గడించి యట్టిచీకుల కిప్పుడు తాము దిక్కగుచుంటిమనియు, పరిచేఁ దాము భంగపడితిమో యట్టిధార్తరాష్ట్రుల ననిఁ జంపఁ గలిగితిమనియు, పగ నీడగలిగిన స్వభుజాదండములకుఁ జందన మాల్యాదుల నర్చించుచుంటి ననియు దెప్పుచుఁ జీకులగు దంపతుల మనంబులఁ జీకాకుపఱచుచు క్షోభింపఁ జేయుచుండును.

కవలీసంగతిఁ గర్ణాకర్ణికగా వినియు విననట్లూరకుందురు సేవకులేమియు ననలేరకుందురు. ధర్మజ ధనంజయులకును, కుంతీ ద్రౌపదులకును నీవృత్తాంత మించుకేనియుఁ దెలియదు. భీముని యుల్లసంబులు విదురుఁడు తీర్థయాత్రనుండి వచ్చునాఁటికే క్రొత్త రాభివృద్ధి నొందెను. ధృతరాష్ట్రుఁడు పుట్టంధుఁడు; ఆపై జరాభారక్లేశి; మఱియు సర్వసుత సుహృద్బాంధవమరణక్షోభిత మనస్కుఁడు; అగుటయె గాక తా నెవరికి మున్నపకృతినొనర్చి యుండెనో వారినుండి తాఁ బట్టెఁడన్నముఁ దినుచుండుట, మఱి యెవ్వానిఁ దా నసహ్యించుకొనెనో యట్టిశత్రుని యుద్ఘాటిత వాక్యాకర్ణనము, కలుగుటచే నుద్విగ్నమనస్కుఁ డగుచుండె. ఇం దొక్కటొక్కటియే దుఃఖసముద్రమున ముంపఁగల్గునవి నవి యన్నియు నొక్కనియందే సమావేశమైనచో నట్టివానియవస్థ యవాఙ్మానసగోచర మని వేఱుగఁ జెప్పవలయునా? అట్టి యన్న విషమస్థితిఁ గనుఁగొని విదురుఁడు రహస్యంబుగా నాంబికేయున కిట్టులనియె.

శా. పుట్టంధుండవు, పెద్దవాఁడవు మహా
భోగంబులా లేవు, నీ
పట్టెల్లం జెడిపోయె, దుస్సహజరా
భారంబు పైఁగప్పె నీ
చుట్టాలెల్లను బోయి రాలు మగఁడున్
శోకంబునన్ మగ్నులై

కట్టా దాయలపంచ నుండఁ దగునే
కౌరవ్య వంశాగ్రణీ.

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ
బట్టితిరి తదీయభార్యఁ; బాండవులకున్
గొట్టితిరి వారు మనుపఁగ
నెట్టఁగున భరింపవలెనె యీప్రాణములన్.

క. బిడ్డలకు బుద్ధిసెప్పవి
గ్రుడ్డికిఁ బిండంబు వండి కొనిపొం డిదె పైఁ
బడ్డాఁ డని భీముం డొఱ
గొడ్డెము లాడంగఁ గూడుఁ గుడిచెద వధిపా.

క. దేహము నిత్యము గాదని
మోహముఁ దెగఁగోసి సిద్ధమునివర్తనుఁడై
గేహము వెలువడు నరుఁ డు
త్సాహముతోఁ జెందు ముక్తిసంపద ననఘా.

అనియె. ఇట్లు విదురుండు ధృతరాష్ట్రునకు ముక్తిమార్గం బుపదేశించిన నతండును బ్రజ్ఞాచక్షుండై సంసారంబు దిగనాడి, మోహపాశంబువలన నూడి, విజ్ఞానంబునం గూడి, ధర్మజు రావించి యాతనికి డగ్గుత్తికతో నిట్లనియె. ధర్మజా! మిమ్ముఁ బెక్కుడుములఁ బెట్టినమహాపకారి నగు నాకు, బుత్రులు లేని లోపము లేకుండఁగఁ బదునైదేండ్లనుండి నీవు కాపాడితివి. "జాతస్య మరణం ధ్రువ"మ్మను నానుడి నీకుఁ దెలియనిది

కాదు. మునివృత్తి గలిగి యోగముచే నంతమునఁ దనువుఁ ద్య జించుట రాజశ్రేష్ఠుల కుచితము కాన, నే నారీతిని బత్నితోఁ దనుత్యాగముఁ జేయుటకు రాజవగు నీయనుజ్ఞం గోరుచున్నా" నన, నాతఁడు కడుదుఃఖితుఁడై యెన్నియోరీతుల నాటంకములఁ జెప్పుచుండఁ గృష్ణద్వైపాయనుం డచటికి కేతెంచి ధర్మజుని సమాధానపఱప నాతం డంగీకరింపక యెల్లి విచారించిత మనెను. పిమ్మట ధృతరాష్ట్రుఁడు పౌరముఖ్యుల రావించి తనమనోరథముఁ జెప్పి వారలతో నిట్లనెను.

*క. మహి లెన్నగ రక్షించిన
మహితగుణుని యన్న, కొడుకు మనుమం డని నా
కు హితంబు కోరి కరుణా
సహితులరై యిం డనుజ్ఞ సద్వ్రతమునకున్.

అన వా రెట్టకేలకు సమ్మతించిరి. ధర్మజుండును "ఇది మిథ్య" మని నిర్ణయింపకపోవుటచే నదియ యనుమతిగాఁ గొని యానాఁటి యర్థరాత్రిమున విదురుం గలిసి పురంబు వెలువడి హిమాలయప్రాంతంబున కరిగెను. గాంధారియు,

చ. వెనుకకు రాక చొచ్చు రణ
వీరుని కైవడి రాజదండనం
బునకు భయంబు లేక వడి
బోయెడు ధీరునిభంగి నవ్వు డ

* ఈపద్యము; ఆశ్ర. 1-89 లోనిది. పాండురాజున కన్న, విచిత్ర వీర్యుని కొడుకు, శంతనుని మనుమఁడు, అని తా॥

వ్వనిత దురంతమైన హిమ
వంతము పొంత వనాంతభూమికిం
బెనిమిటితోడ నించుకయు
భీతివహింపక యేఁగెఁ బ్రీతితోన్.

మఱునాఁడు ధర్మజుండు కాల్యంబులఁ దీర్చి యెప్పటి యట్ల తండ్రికి మ్రొక్క-వచ్చి శూన్యంబగు తద్గృహంబుఁ గాంచి సంజయుచే వారి పోకడఁ దెలిసి విషాదంబున సభాస్థలి కేతెంచి సభ్యులకుఁ దద్వృత్తాంతం బెఱిఁగించి తమ్ములతో ధృతరాష్ట్రుం జూడఁ బ్రయాణమగుడు యుద్ధమృతులగు ధార్తరాష్ట్రవనితలు సపుత్రయగు నుత్తరయు, కుంతీద్రౌపదులు మున్నగు నంతఃపుర కాంతలు, సంజయుండును వారితోడనఁ బయనమైరి. కొందఱు పౌరులు వారితోడన రాఁ దలంప ధర్మజుం డనుమతిసేసి పుర రక్షణమునకు 'యుయుత్సుని' నియోగించి, ఉచితపరికరంబుల తో నెడనెడ విడియుచు హిమవంతంబుపొంత గంగాతీరంబున శతయూపమహర్షి యాశ్రమోపాతంబునఁ గదళికావనంబునఁ బత్నీసహితుండై, ధృతరాష్ట్రుం డుండుటఁ దెలిసికొని యా యాశ్రమము సమీపించి యట విడిసెను. ధర్మజాదు లాశ్రమ ముఁ బ్రవేశించు సమయమునకు ధృతరాష్ట్రుఁడు గంగలోఁ గ్రుంకులిడి సకలశహస్తుఁడై గాంధారి నానుకొనివచ్చుటను దా దవ్వులఁగాంచి ధర్మజుండు రోదనము సేయుచు నాతనిహస్తము లన్నుఁడి యుదకకలశముం గొని "ఓమహారాజా! నీ కిట్టిదశ

ప్రాపించిన విధి నేమనవచ్చును. ఇట్టియవస్థ నొందుట నీ కుచిత మా ? అని పలుభంగులఁ బలవించుచు నాశ్రమంబున కేతెంచెను. అచట సమావేశమయిన నరనారీకమునకు ధృతరాష్ట్రు నవస్థం జూచునపుడు కలిగిన రోదనంబులు, యుద్ధాంతంబునఁ బొలికలనిగోదనంబులం దలఁపించుచుండెను. అంతటి రోదనధ్వని నంతకుముం దెఱుఁగని పరిక్షిత్తు తల్లియొడిలోఁ జేరి యడలున వెక్కి వెక్కి యేడ్చెను. కొంతతడవునకు వారంద ఱుపశమిల్ల ధర్మజుఁ డెన్ని యేని యుక్తులచే ధృతరాష్ట్రుని దిరిగి పురంబునకుం గొనిపోవఁ బ్రయత్నించెం గాని, చిత్రకూటస్థుఁడగు రాముని భరతుఁ డయోధ్యకుఁ గొనిపోవఁ జేసిన ప్రయత్నమువలె నిదియు వ్యర్థమయ్యెను. అంతలోఁ గృష్ణద్వైపాయనుఁ డేతెంచి వాన ప్రస్థుండగువానిఁ దిరిగి పురప్రవేశంబు సేయించుట యనుచిత బన, ధర్మజుం డట్లేని యుయుత్సునకుఁ బట్టాభిషేకంబు సే యంధనృపతి కుపచారంబులు సేయుచు నిట నుందు నన వైశ్య యనుండు వేదంబున * వైశ్యాపుత్త్రునకుఁ బట్టాభిషేకముఁ జేయ రాదని కలదు. కాన యుయుత్సుఁ డెట్లు పట్టాభిషేకార్హుఁడగు? క్షత్త్రియోచితంబగు ప్రజాపాలనంబె నీకుఁ గర్తవ్యంబు. పరిక్షిత్తు యుక్తవయస్కుం డగుతరి నాతనికిఁ బట్టాభిషేకం బొనరించి నీవు నిట్ల ససోదర్యుండవై వనంబున కరుదెంతువుగాక యనుడు నట్ల కేల కంగీకరించెను.

---

* "వైశ్యాపుత్త్రం నాభిషించేరన్" శ్రు॥ య.

పిమ్మటఁ బారాశర్యుండు ధృతరాష్ట్రుఁ గని "పుత్త్రా! నీవు సర్వకామములను వర్జించు నవసర మయ్యెఁగాన కడపటిదగు నీకోరిక యేదియో చెప్పుము; అది యెట్టి దుర్లభం బైనను దానిని దీర్ప నే నిచటికి వచ్చితి" నన నాతండు డగ్గుత్తికతో "మహానుభావా! యుద్ధమృతులగు పుత్త్రపౌత్త్రాదుల నొక్క-పరి చూచు నభిలాషము గలదు; గాంధారికి నట్టియభిలాష మే కల" దన నేఁటిసాయంకాలమున నట్టివినోదము గలిగింతు ననె. ఆమాట విని యచ్చటి నరనారీక మెప్పుడు సాయంకాలమగునా యని క్షణ మొకయుగముగాఁ దలంచునంతలో నుషాపతియు నస్తాద్రిం జేరె. సాత్యవతేయుఁడు సాయంసంధ్యాక్రియలను నిర్వర్తించి, ధృతరాష్ట్ర ధర్మరాజాది పురుషులును, కుంతీ గాంధార్యాదిసుతులును, యుద్ధమృతులగు కౌరవవీరుల భార్యలును, ఆశ్రమస్థమునివర్యులును వెంటరా గంగాతీరమున కేఁగి వారిం దత్తటంబున యథోచితంబుగఁ గూర్చుండ నియమించి గంగాజలంబులం దిగి యుద్ధమృతుల నాహ్వానించెను.

వ్యాసుఁ డాహ్వానముచేయ నాగంగనుండి భీష్మద్రోణులఁ బురస్కరించుకొని దుర్యోధన దుశ్శాసనాది గాంధారేయ శతకంబును, తత్పుత్రాదులును ద్రుపద ధృష్టద్యుమ్నాదిపాంచాలురును, విరాటాది మాత్స్యులును, శకున్యాదిగాంధారులును, బాహ్లిక సోమదత్తాది కౌరవులును, అభిమన్యు ఘటోత్క-చాది పాండవ కుమారవీరులును, తక్కఁగల శూరులును, యుద్ధ

ప్రస్థాన దివసమున నేయే యుడుపులను ధరించిరో, ఎట్టిశస్త్రాస్త్ర
నిషంగాదులను వహించిరో, ఏయేవాహనాదుల నధిరోహించి
రో, ఆయుపకరణములతో నారీతిని వెలువడి ప్రేక్షకులయెదుట
ను, పటంగతులవలె భాసిల్లిరి.

ధృతరాష్ట్రునకు ద్వైపాయనుఁ డనుగ్రహించుటచే నా
తండు తాత్కాలిక చక్షుష్మంతుండయ్యె. గాంధారియు గంతలు
విప్పికొని స్వర్గానీతరణవీరులను సభర్తృకయు సస్నుషయు నై
శోకానందాశ్చర్యభావశబలితహృదయయై వీక్షించెను. తక్కుం
గల కుంత్యాదివనితలు పాండవులుఁగూడఁ దాదృశావస్థనె
పొందిరి. పరలోకానీతు లానాఁటిరాత్రి ప్రేక్షక నరనారీక మధ్య
గతులగుటచే, త న్నరనారీకమున కానాఁటి త్రియామ జీవితము
నం దమేయానందదాయినిగా నుండెను. అట్టి యానందము
కౌరవపాండవుల జీవితకాలమున మహావైభవయుక్తమగు నింద్ర
ప్రస్థపురిలోని రాజసూయాధ్వరముననె సంభవించెను. ఇపు డది
నిర్జనారణ్యమధ్యమున వ్యాసమహిమముననె కలిగెను. ప్రేక్ష
కులు, వీరలు జీవించినకాలమున నెట్టి ప్రేమావస్థ ననుభవించి
రో నేఁటిరాత్రియు నట్టియవస్థనే యనుభవించిరి. యుద్ధకాలమున
నెట్టి వైమనస్యములుండినను, పరలోకాగతులయందు మందున
కైన నట్టి వైమనస్యములు లేకుండెను.

వేగుఁజుక్క పొడముడును, పారాశరి ధర్మరాజాదుల
కా కాలము నెఱింగించి పరలోకాగతులు పరదినమున నీలోక

మున నుండరామిఁ దెలిపి వారి యానందమున కంతరాయమొన ర్చె. పిమ్మట నెప్పటివలె గంగావగాహనమునఁ బరలోకాగతుల నామంత్రణముఁ జేసి యథాస్థానోద్వాసనముఁ గావించెను.

పరలోకాగతవీరు లంతర్హితులగుడు నొక్కపెట్టుగఁ గౌరవాంగనలలో రోదనధ్వను లుప్పతిల్లఁ జూచి, పారాశరి యా ధృతరాష్ట్రు స్నుషలంగాంచి మీయం దెవ్వరైనఁ బతులతోఁ బరలోకమున సుఖింపఁగోరుదురేని వారి నీగంగాముఖమునఁ బంపుదు నన, సంతోషితస్వాంతలై దుర్యోధనాదులవనిత లివా మునకు రోసి, ముని చెప్పిన చొప్పున గంగఁబ్రవేశించి పరలోకగత లైరి. తక్కినవారు శతయూపాశ్రమముఁ జేరిరి. ఇదియంతయుఁ గాంచి పరిక్షిత్తు విషాదాశ్చర్యమగ్నమానసుం డయ్యె.

పిమ్మట వాసిష్ఠి వచనంబులు చొప్పున ధర్మజాదులు ధృ తరాష్ట్రు నామంత్రితుఁజేసి స్వనగరంబున కేఁగు నవసరం బగు డు, పృథాదేవి పుత్రులం గాంచి "పుత్రులారా ! నా కైహికము పై నాసవదలినది; తక్కుంగలవారి మరణంబులకంటె, కర్ణాభి మన్యుల మరణంబులు నాకు హృదయశల్యములై బాధించుచు న్నవి. ఈబాధ నపనయించుటకు శాంతాశ్రమనివాసమున భగవ ద్ధ్యానమే భేషజమని తలంచితిని" అని పలికెను. పిమ్మట భీమధర్మజు లడ్డంకు లెన్నియేనిఁ జెప్పిరి. కాని, కుంతి వారియు క్తులకుఁ బ్రత్యుక్తులఁ జెప్పి వారలను నిరుత్తరులం జేసి తా నప్పకు బావకుఁ దోడునీడగ నుండెను. సంజయుఁడును ధృత




రాష్ట్రములకు మార్గదర్శిగా నుండ [illegible] నివసించెను. పరలోకగతుల ప్రదర్శనమునకుఁ [illegible]దినముననె విదురుఁడు ధర్మజాదుల యాశ్రమప్రవేశము నాకర్ణించుచు, చతుర్థాశ్రమ స్వీకారము నొంది, అవధూతయై మౌనవ్రతము నను పాండవులఁ గాంచి ధర్మజు నెదుటనే యసువుల విడిచి పారాశరికిఁ దగినముక్తి నొందెను.

పిమ్మటఁ బాండవులు సపరివారులై గజపురిఁ బ్రవేశించిన యనతికాలంబుననె నారదువలనఁ గుంతీ గాంధారీ ధృతరాష్ట్రులు, దావాగ్ని చుట్టుముట్ట దానినుండి తప్పించుకొనువలను గానక యోగసమాధి నొంది ముక్తశరీరులై ముక్తి నొందినటులును, గావల్గణి, దావాగ్ని నొక్కవలనఁ దప్పించుకొని హిమాలయోత్తరభూమి కరిగి నటులును విని వారికై మిగుల విచారించి పారలౌకికక్రియలను పాలాశవిధిని నిర్వర్తించి నిష్పిత్ర్యాణులైరి. ధృతరాష్ట్రమృతిచే నిశ్శత్రుశేషులునైరి.

---

## సప్తమానువాకము.

యాదవాంతఃకలహహేతువులు, తస్మరణములు, కిరాతవిజృంభణము.

ధృతరాష్ట్రాదులు స్వర్గతులైనయచిరకాలముననే ద్వారకలో బహూత్పాతము లుద్భవించి వృష్ణ్యంధకభోజులకు భీతిం

గలిగించెను. యాదవులలోఁ గృష్ణ బలరాము సాత్యకి సాంబ ప్రద్యుమ్నాదులు వృష్ణికులజులు. కంస కృతవర్మాక్రూరశత ధన్వాదులు భోజకులులు. యయాతిశాపంబున వృష్ణికులజులగు యాదవులకు రాజ్యార్హత లేదు. భోజులే రాజులు; ఆమర్యాద ననుసరించియే కంసుఁడు మధురలో రాజ్యము చేసెను. అతఁడు వృష్ణికులజులగు వసుదేవాదులను మిగుల బాధించెను. శ్రీకృష్ణుఁ డుద్భవించి క్రూరుఁడగు కంసుని జంపి ప్రాచీనమర్యాదను నిలుపుతలఁపున, ఉగ్రసేనుని బట్టాభిషిక్తుం జేసి తాను మంత్రియయ్యె. కంసునిమామయగు జరాసంధుని బారికి జడిసి కృష్ణుఁడు మధురను విడిచి ద్వారకను రాజధానిగాఁ జేసెను.

సత్రాజిత్తను నాతఁడు భోజకులజుఁ డగుటను స్వజాతి ప్రముఖులగు శతధన్వాక్రూర కృతవర్మలలో నొకనికిఁ దన కూఁతు రగు సత్య నిచ్చి పెండ్లిసేతు నని మాట నిచ్చియు శమంతకమణి వ్యవహారముచే, * కృష్ణున కామె నిచ్చి పెండ్లి సేయవలసివచ్చె. వాగ్వ్యభిచారి యగుటను సత్రాజిత్తుపై రోస మూని శతధన్వుఁ డాతనిని రహస్యమున సమయించి పిమ్మట శ్రీకృష్ణునిచే హతుఁ డయ్యె. ఆపగయె కృతవర్మమనంబున నిడుకొని కాఁబోలు కురుక్షేత్రసంగ్రామంబునఁ గృష్ణున కెదుటిపక్షమగు కౌరవపక్షమునఁ జేరె. మహాయుద్ధమునం జావక మిగిలిన కృతవర్మ ద్వారకం జేరెను. కృష్ణానుజుండగు సాత్యకికిఁ గృత

* వినాయక చతుర్థినాడు శమంతకమణి కథను జెప్పుదురు.

వర్మపై నీసు మెండుగ నుండుటచేతనే యాతఁడు కురుక్షేత్ర సంగ్రామమునఁ బెక్కుసారులు కృతవర్మతోడనె పోరుచుండు వాఁడు. వృష్ణి భోజకులజుల యంతఃకలహములు పెచ్చుపెరుఁగుచుండు సమయముననే యొకప్పుడు 'కణ్వ విశ్వామిత్ర నారద మహామునులు' కృష్ణుఁ జూడ ద్వారక కేతేర, కాలకర్మవశంబున మదోన్మత్తులగు యాదవకుమారులు పూర్వము శిశుపాలావహ్రృతయగు బభ్రుని భార్యయొక్క వేసమును, కృష్ణపుత్త్రుఁడగు సాంబునకు వేసి యామునులకు మ్రొక్కించి "అయ్యలారా! ఈమె బభ్రుని భార్య, నిండుచూలాలు, ఈమెకు మగబిడ్డ కలుగునా యాఁడుశిశు వుదయించునా? జ్యోతిర్విదులగు మీరు సెలవియ్యవలయు" నన వారి ప్రల్లదంబులకు మును లలిగి "ఈమె కడుపున ముసలాపత్యము జనించును. దానివలన యదు వృష్ణిభోజాంధకులు నశింతురు" అని ఘోరముగా శపించి వెడలిపోయిరి.

మునులు వెడలిన మఱునాఁడే సాంబుని గర్భమునుండి యుశని సదృశము నయోమయము నగు ముసల ముద్భవించెను. తద్వృత్తాంతము నెఱిఁగి వసుదేవుఁ డాయినుపరోకలిఁ దెప్పించి రజంబగునట్లు పొడిపించి శరధిలో విడఁజల్లించెను. అది కడలిలో మూఁడంచుల కసుఁవ పులిదై పెరుఁగుచుండెను. ఇటులుండ ద్వారకలో నేకోత్తరాభివృద్ధి యగు బహూత్పాతంబులకుఁదోడు మధుపానంబును మితిమిఱుటఁ గాంచి రాజగు నుగ్రసేనుఁడు

రామకృష్ణాదులగృహములం దొట్టి యేరి యిండ్లయందును మధుపానంబు సేయరాదనియు నటులు చేసినవారు శూలారోపణశిక్షకుఁ బాత్రులగుదు రనియుం జాటింపించెను.

ఇటులుండ సముద్రతీరంబున నొక యుత్సవము సేయఁ దటస్థింప యాదవులందఱు బంధుమిత్రాదులఁ గూడి వాహనాదులపై నచటికి నేగిరి. ద్వారకలో వసుదేవోగ్రసేనులు బాలికాబాలురు నబలలుమాత్ర ముండిరి. ఉత్సవప్రస్థానమున ద్వారకలో నిషేధింపఁబడిన మధుపానమును సముద్రతీరమునఁ జేయు కుతూహలముతోఁ బ్రతిశకటమునను, మధుకుంభములు యాదవులచే నిక్షిప్తములై తేఁబడెను. సముద్రతీరమున విడియుటయే తడవుగాఁ గృష్ణుఁడుదక్క దక్కినవారందఱు నానావిధమధువుల నాప్యాయనంబున నాస్వాదించిరి. దుర్వ్యసనము శాసనమాత్రమున నొకపర్యాయమే విడువఁబడదుగదా!

మధుపానముచేఁ దృప్తులగువారు దృప్తు లగుట వింతయా? మహావీరుండును కృష్ణభక్తుండును నగు సాత్యకి ప్రథమముననె మధుపానోన్మత్తతచే నవ్యక్తప్రలాపంబులాడుచు సహజశత్రుండగు కృతవర్మను దూషింప నారంభించెను. సర్వవిధముల నతని కీడగు కృతవర్మయు నతనినే కాక భూరిశ్రవసువధమునందలి కృష్ణచర్యనుగూడ నుద్ఘాటించి తూలనాడ, సాత్యకి కృష్ణువదనం బుపలక్షించె. కృష్ణుని కామాటలు రోషహేతువు

గానుంటయు, కృష్ణుని క్రోధవీక్షణములు భోజులపైఁ గూడఁ బ్రస
రించియుంటయు ముఖలక్షణంబు చేతనే సాత్యకి తెలిసికొని కేల
నున్న వాలుచేఁ డటాలునఁ గృతవర్మతలను నఱికివైచి యక్రూ
రాది భోజులపైఁ గవియ వారును, కాలకర్మవశంబున నొండొళ్లు
తెలియక సాత్యకిం దుత్తునియలగునటుల నసులచేనఱికి యసువులఁ
బాపిరి. పిమ్మటఁ బ్రద్యుమ్న సాంబాదులును నాయుధంబులు
లేకుండినను సమీపంబున మునిశాపజనిత ముసల చూర్ణోద్భూ
తమును, నిశితధారా విరాజితము నగు మూఁడంచుల తుంగం
బెఱికి దానిన యాయుధములుగఁ గైకొని భోజులను మోఁది
వారిచే మాఱుమోఁదులం బడి మడియించి తామును మడిసిరి.
శ్రీకృష్ణునెదుటనె యీదృశ్యము, ఝరీ శరవేగంబులను మించి
నిమిషార్ధముననె జరిగెను.

అమితసంఖ్యగల భోజకులజులు శేషించి యుండుటయు
స్వపుత్ర పౌత్రాదులు వారిచే హతులగుటయుఁ గాంచి, త్రివిక్ర
ముండు త్రికాలవేది యయ్యుఁ దత్కాలోద్భూతక్రోధంబున
మూఁడంచులతుంగ చేతనే శేషించినమిక్కిలి భోజకులజుల సం
హరించి శవమయమగు బట్టబయలఁ దిలకింప, బభ్రువను తన
సాపత్నీసోదరుండును సారధియగు దారుకుండును మాత్రమే
హతశేషులై కానుపించిరి.

ప్రలంబఘ్నుండు కలహారంభమునకుఁ గించిత్పూర్వమె
పానసభను వదలి దాని కనతిదూరమున నున్న యొక వనస్పతి

మూలముఁజేరి యోగనిష్ఠాగరిష్ఠుం డయ్యె. శ్రీకృష్ణుని కపుడు దుర్యోధన వధానంతరమున నుండిన కౌరవయుద్ధరంగమును "జ్ఞాతులన్యోన్యము నీకతంబున కలహించి చచ్చినటుల నీజ్ఞాతులును నన్యోన్య కలహమునఁ జత్తు"రని తన్ను శపించిన గాంధారిశాపోక్తులును జ్ఞప్తికిరా, భగవంతుండైనను మానుషరూపమును ధరించుటచే నాతనిమనంబునకు వేదనగలిగెను. అట్టితఱిఁ గేవల మనుష్యుండైన నెట్లుండునో! వాసుదేవుని కప్పుడు ద్వారకలోని యనాథవనితలు నరక్షితబాలబాలికలు నపారధనరాసులు నశక్తులగు తలిదండ్రులు ద్వారకాపరిసరమున దస్యుత్వమే వృత్తిగాఁ గలిగిన బలవత్కిరాతబృందము తలంపునకురా, డోలాందోళిత మనస్కుండయ్యె. పిమ్మటఁ గృష్ణుఁడు బభ్రుఁజూచి వేగమె నీవు కరినగరంబున కరిగి కవ్వడి నిటకుఁ దోడితెమ్మన నాతండు వల్లె యని పోవుచుండఁ గృష్ణుని కెదుటనె కూఁతవేటుదూరమున నొకకిరాతుఁడు దబ్బాటున బభ్రువుపైఁ బడి ముఁడంచులతుంగచే మోఁది యాతని విగతాసువుఁ జేసెను. కృష్ణుఁ డాకిరాతుని వెనుదగుల నుంకించియు వాఁడు కనుమొఱఁగినందునను, భవిష్యత్కార్యతంద్రాళితచేతను, కిరాతుని వెదకుటనుమాని దారుకుం జేరం బిలిచి నీవు వేగమె యింద్రనందను ద్వారకకుం దోడి తెమ్మని పంపె.

కృష్ణుఁడు నిర్వీరవతియగు ద్వారకం బ్రవేశించి యయుక్త యాదవమరణవృత్తాంతమును, అన్న తపశ్చరణనియతుం

డగుటయు, వసుదేవునకుఁ జెప్పె. మఱియు నిష్పురుషయగు ద్వారకలోఁ దానుండననియు, తాను నన్నువలె తపశ్చర్యకుం గడంగుదు ననియు, పార్థుం డింతకు నేఁగుదెంచి స్త్రీ బాలవృద్ధ సంఘము నరసి రక్షించు ననియు, నేఁటి కేడవనాఁడు ద్వారక సముద్రమగ్నయగుఁగాన నాఁటి కీపురిఁ గలుగు స్త్రీ బాలవృద్ధ సంఘమును ధన ధాన్యాదులను తరలింపుమని నామాటగఁ బార్థుతోఁ జెప్పునది యనియు, మిథస్సంభాషణంబు నన తండ్రితో వాక్రుచ్చి, యాదవనాశవార్తను గుప్తంబుగ నుంచునది యని వసుదేవు నానతినొందియె త్వరితగతి నన్న యున్నతావున కేఁగ నాతఁడు యోగంబు నన కృష్ణు నెదుటనె పంచభూతమయుం డగుడు నాతని దేహంబునుండి యనంతరూపమగు భుజంగం బుద్భవించి యదృశ్యం బయ్యె.

దానింగాంచి యచటనె వనస్పత్యంతరముం జేరి యుత్తానీకృత దేహుండై శయనించి యొకజానువుపై రెండవజానువుం జేర్చి కృతమును స్మరించుచుండునంతలో మూరస్థుండగు నొక కిరాతుఁడు కృష్ణపాదాగ్రమును, కలాపభృత్కలాపముగా దలంచి తీక్ష్ణార్ధచంద్రవిశిఖంబు వింటం దొడిగి గాఢంబుగ నాటనేయ నది, కలాపభృత్కలాపస్రవంతీ జనకంబగు నాపాదముం గాఁడి రక్తస్రవంతిం బుట్టించి, అన్నమయంబగు నాతని భౌతిక దేహంబమృతమయం బగుటకుఁ గారణం బయ్యె. అంతలోఁ గిరాతుం డేతెంచి తాఁగొట్టినది కేకినిగాక కేకిపింఛధారి నని నిర్వి

ణ్ణుండై యల్లంతన యడలున మ్రొక్కుచు క్షమింపుఁ డనఁ గృష్ణుఁడు వానిని క్షమించి * దుర్వాసముని వాక్యంబునఁ దన కట్లగుటఁ దెలసి, భౌతికదేహంబు నీలోకమున విడిచి యమృతానందమయం బగు వైకుంఠం బను స్వధామంబునకుఁ జేరెను.

అట దారుకుఁ డర్జునుకొఱ కేగుచు మధ్యేమార్గంబున శ్రీకృష్ణసందర్శనమునకై ద్వారక కేతెంచు నర్జునుఁ దారసించి, కృష్ణసందేశంబును, యాదవనాశంబును జెప్ప నాతఁ డొడల నమ్ములు నాఁడిన ట్లుద్వేగమనస్కుండై ద్వారకకుఁ ద్వరితగతి నేగుదెంచి వసుదేవునకుఁ గానుపింప నాతఁడు కృష్ణుని యాదేశంబును నూత్రిప్రియంబుగఁ జెప్పి తా నప్పుడ యర్జునుని సన్నిధిని యోగమార్గంబునఁ బరమాత్మం బొందెను. తన్మరణంబునకు శోకించి యర్జునుండు వసుదేవునకుఁ బ్రిపౌత్రుఁడును, యనిరుద్ధపుత్రుండు నగు వజ్రుని గర్తఁగఁజేసి, ఆనకదుందుభికి నౌర్ధ్వదైహిక క్రియలం జేయించి వేవేగమె కృష్ణాన్వేషణంబు కై వనధితీరవనిఁ దఱిసి, కాక కంకావృతంబగు యాదవుల

* ఒకప్పుడు దుర్వాసుఁడు శ్రీకృష్ణుఁ బరీక్షింప నెంచి ద్వారక కేఁగి కృష్ణునాతిథ్యము నొంది రుక్మిణిని గృష్ణమనఃపరీక్షకై కొన్ని బాధల తనకు క్షీరాన్నాసక్తి గలుగుటం దెలిపినఁ గృష్ణుఁ డట్లు సేయింప, క్షీరాన్నముఁ దనయొడలికిఁ బూయు మనఁ గృష్ణుఁ డట్లు సేసె. కఃపాదంబునఁ బూయక పోఁగాఁ గృష్ణుతో "నీ కెందును నాపద యధఃపాదంబున లేపనంబు నేయమి నీకధఃపాదంబున నె శరఘాతం డంబు గలుగు" నని చెప్పెనట!

పోలికలనిం గని, అమేయదుఃఖాన్వితుండయి పోవఁబోవ నొక్క యెడ, అచ్యుతాగ్రజు నస్థిపంజరంబును, దాసి కనతిదూరంబున నచ్యుతుని భౌతికశరీరంబును గాంచి వెల్లివిరిసి వచ్చు దుఃఖాంబుధిలో మగ్నుఁడై హా! కృష్ణా! యని నేలపై వ్రాలి మూర్ఛిల్లి, కొంతవడికిఁ దెలిసి, యాతనిచేఁతలు నైకవిధముల నుగ్గడించుచు, పునఃపునర్మూర్ఛలఁ దేలి తేలి తనది యరణ్యరోదన మనుకొని కరిష్యమాణకార్యం బూహించి సన్నిహితవనస్పతుల నుండి సమిధలను సంగ్రహించి మథనాగ్నిచే నాపద్ధర్మవిధిని, సచ్చిదానంద విగ్రహులగు రామకృష్ణుల భౌతికదేహంబులఁ జితాగ్ని కర్పించి, అనృణుండ ననుకొనియె.

పిమ్మట భవితవ్యంబునకై త్వరమాణ మానసుండై ద్వారకంజేరి నేఁటికి మూఁడవనాఁడె ద్వారక సముద్రంబుచే ముంపఁబడుననియు, మీరందఱు ధనధాన్యంబులఁ బదిలంబుగఁ జేర్చుకొని మెల్లి సాయంకాలమునకె ద్వారకాపురిని నిర్గమించి యోజనంపు దూరంబున శిబిరంబుల విడియవలయుననియు, ఇది కృష్ణాదేశంబనియుఁ జాటింపించి కృష్ణుభార్య లాదిగాఁగల యంతఃపురకాంతలను శిబికల నాందోళికల రథంబుల నధిరోహింపఁ జేసి, అమిత ధనరాసుల నుష్ట్రంబుల, వేసడంబుల, వృషభంబుల, శకటంబుల, గోనెల వేయించి మోపించుకొనుచుఁ దాను వెనుకయై, ద్వారకా బహిర్భాగంబునుండి యోజనదూరంబు నతిక్రమించి, అంతకుమున్న పరిజననిర్మితంబులగు పటకుటీరంబులఁ

జేర్చెను. తక్కంగల పౌరులును స్వవస్తువాహననివహంబులఁ గొని యర్జునానుమతంబున నట్లు శిబిరంబులఁ జేరిరి.

మఱునాఁడు వేకువ, ఉదధి తాళవృక్షోన్నత తరంగ మాలికలతో బోరుకొలుపుచు నుప్పొంగి ద్వారకాపుటభేదనంబు నొక్కపెట్టుగ నర్జునాదులు సూచుచుండ వారి యెట్టయెదుటనె ముంచి తత్పురోన్నత సౌధాములతోడనె లోనికిఁ గొనెను. స్వ గృహాదులు జలమగ్నంబు లగుట దాదవ్వులం గాంచి శిబిరస్థ జను లొక్కపెట్టునం గొల్లుమని యేడ్చిరి. పిమ్మట నర్జునాను మతంబున వారు పయనంబై మరుస్థలమార్గంబున నింద్రప్రస్థ పురి వైపున కరుదెంచుచుండిరి.

యాదవు లన్యోన్యకలహంబునఁ జచ్చుటయు, కృష్ణ నిర్యాణంబును, జంఘాలురగు బోయలవలనఁ బంచనదప్రాంతపు బోయలు తెలిసికొని వారు ద్వారకం గొల్లఁగొన నేతెంచుచు మార్గమధ్యంబునఁ బలవలనిమూఁకచే రక్షింపఁబడుచు నర్జునుని యాధిపత్యంబున వచ్చుచున్న కృష్ణ కృష్ణానుయాయుల వనితా సహస్రంబును, అగణ్య ధనరాసులను, కాంచి విమోహితులు లుబ్ధులు నగుటచే నాలుబ్ధకులు పార్థుం డొంటరి యనియు రక్షక భటు లల్పసంఖ్యాకు లనియుఁ దాము వేసకువేలుగ నుంటిమని యు దీమసమున నా నారీమండలంబు పైఁబడి, మండనంబులను, మండనవతులను గూడ దోఁచికొన నారంభించిరి. అది తెలిసి రక్షకభటులను బురికొల్పి కవ్వడి కవదొనలును, గాండీవంబును,

బూని వారిపై శరవర్షంబు గురియింప వేఱొకపక్క మఱికొందఱు కిరాతులు నారీమండలమును, ధనరాసులను, దోఁచికొనిరి.

పార్థశ్రవసుండు వృద్ధుండగుటచేతను, తన బాహుబల విజృంభణమునకుఁ గారకుఁడగు కృష్ణుండును, తత్సహచరులగు సాత్యక్యాదులును, పరాసువు లయిరను విచారమునను, నిస్సారుఁడై 'సవ్యసాచిత్వ, విజయత్వ, బీభత్సత్వ, ధనంజయత్వములను' క్షాత్రముతోఁగూడఁ గోలుపోయెను. కర్ణద్రోణాదులపైఁ బ్రయోగించిన దివ్యాస్త్రంబులు ప్రతిభాషింపకుండెను. శరధులంబోని శరధులు శరశూన్యంబు లయ్యెను. దృష్టిముష్టి బలంబులు సడలఁ బురుషవిగ్రహుండై యయ్యెను.

బోయలు విజృంభించి యావద్ధనరాసులను జూఱఁగొనిరి. మఱికొందఱు వనితలఁగూడ నపహరించిరి. కొందఱు మానిను లాఘోరసమయంబున మానంబులు దక్కవని యాత్మహత్యలఁ గావించుకొనిరి. కొందఱు దుష్టాంగనలు మాత్రము బోయలను స్వేయముగానె కాముకత్వమున వరించి వెన్నంటి పోయిరి. అర్జునుం డీమహోత్పాతదృశ్యముఁ గాంచి యిదియంతయు భగవల్లీల యనియు, దైవికము దాఁట నేరికి నశక్యమనియుఁ దలఁచి గాండీవంబుతోడనె పెక్కండ్రబోయలను మోఁది యంతకపురి కనుచుచు, శ్రీకృష్ణబలరాముల యంతఃపురాంగనలను, కృతవర్మాకూ్రర సాత్యకుల కుటుంబములను, వజ్రుని, కాఁచుకొని,

ఎట్టకేలకు బోయల బారినుండి వెడలెను. అక్రూరాదులును, అపారధనంబులు దక్కుటం జేసి తృప్తి నొంది తమదారిం బోయిరి. ఖిన్నమనస్కుడగు నర్జునుండు తనకంటె దైన్యముతో నున్న వజ్రాదులం గూడి యింద్రప్రస్థపురిం జేరెను.

పిమ్మట నాతండు, మధురాపురీ రాజ్యాంతర్భూతమై యొకప్పు డింద్రప్రస్థభూమి యుండుటచే యాదవుల కది "అభిజన" మగునని తలంచి వజ్రున కింద్రప్రస్థమును, సాత్యకి సూనునకు సరస్వతీపురమును, ఏలుకొననిచ్చి, వార్ష్ణేయులు రాజ్యానర్హులనెడి యాంక్షను బోగొట్టెను. భోజులకు రాజుగం గృతవర్మపుత్రు నేర్పఱిచి, ఆతనిని దక్షిణాపథములోని 'మృత్తికావత' పురమున కభిషిక్తుం జేసెను. భోజకులజులగు నక్రూరు సంతతివారిని వజ్రుండు పోషించునటుల నాతని కిల్లడ సేసెను కాని వారు వజ్రపాలితులుగ నుండ నిష్టపడక స్వచ్ఛందచారులై యెటకో పోయిరి.

పిమ్మట నర్జునుం డనసతవదనుండై రుక్మిణ్యాది కృష్ణ షీమణులకడ కేగి కృష్ణుండని రుద్ధస్వరుం డగుచు, వారు నీతనే కృష్ణనిర్యాణముం దెలిసికొని భర్తృస్మరణంబు చు సహగమనంబు సేసిరి. సత్యభామాదులు తపశ్చరణాం హిమవదుత్తరభాగమున కేగి తపశ్చరణంబున గాలాంతమునం గీర్తిశేషు లైరి.

పిమ్మట నర్జునుం డన్న కిది యంతయు విన్నవింప కరినగ రంబున కరుగుచు మార్గమధ్యంబునఁ బారాశర్యుఁగాంచి కృష్ణ నిర్యాణాది సమస్తయాదవనాశమును, తద్వనితాపహారణమును, విన్నవింప నాతం డిది దైవకృత్యం బనియు, దీనికై చింతింప నవ సరములేదనియు నోదార్చి తనదారిని దాను బోయె.

---

## అ ష్ట మా ను వా క ము.



### పరీక్షిత్పట్టాభిషేకము.

యాతాయాత జనంబువలన యాదవుల నాశంబు విని యుఁ గృష్ణు నిర్యాణంబు నెఱుంగక, దుర్నిమిత్తంబులు పొడ సూప వికల హృదయుండై పార్థునిరాక కెదురుచూచుచు ధర్మ జుఁడు భీమున కిట్లనియె.

మ. హరిఁ జూడ న్నరుఁ డేఁగినాఁడు నెలలే
డయ్యెంగదా రారు, గా
లరు లెవ్వారును యాదవుల్ సమదలో
లస్వాంతు లీవేళ సు
స్థిరులై యుండుదురా ? మురారి సుఖియై
సేమంబుతో నుండునా ?

యెర వై యున్నది చిత్త మీశ్వరకృతం
బెట్లోకదే మారుతీ.

మ. యవ పద్మాంకుశ చాప చక్ర ఝష రే
ఖాలంకృతం బైన మా
ధవు పాదద్వయ మింక మెట్టెడు పవి
త్రత్వంబు నేఁ డాదిగా
నవనీకాంతకు లేదుపో, మఱి మదీ
యాగంబు వామాక్షి బా
హువు లాకంపము నొందుచుండు నిల కే
యుగ్రస్థితుల్ వచ్చునో.

ఇట్లనునంతలో ఖేదచేతస్కుండై, విన్ననగు మొగంబు గలిగి యర్జునుండు వచ్చి యన్న కెఱఁగి కన్నీరు మున్నీరుగ నేడ్వ ధర్మజుం డాతని లేవనెత్తి యిట్లనియె.

శా. ము న్నుగ్రాటవిలో వరాహమునకై
ముక్కంటితోఁ బోరుచో,
సన్నాహంబునఁ గాలకేయుల ననిం
జక్కాడుచోఁ, బ్రాభవ
స్కన్నుండై చను కౌరవేంద్రునికై
గంధర్వులం దోలుచోఁ,
గన్నీ రెన్నఁడుఁ దేవు తండ్రి చెప్పుమా,
కల్యాణమే చక్రికిన్.

అని పలికినం గన్నీరు కరతలంబునం దుడిచికొనుచు నర్జునుం డిట్లనియె.

క. మనసారథి, మనసచివుఁడు,
మనవియ్యము, మనసఖుండు, మనబాంధవుఁడున్,
మనవిభుఁడు, గురుఁడు, దేవర,
మనలను దిగనాడి చనియె మనుజాధీశా.

చ. అటమట మయ్యె నాభజన
మంతయు భూవర ! నేఁడు చూడు మా
యిటువలె గారవించు జగ
దీశుఁడు కృష్ణుఁడు లేనిపిమ్మటం
బటుతర దేహలోభమునఁ
బ్రాణము లున్నవి వెంటఁబోక నేఁ
గటకట పూర్వజన్మమునఁ
గర్మము లెట్టివి చేసినాఁడనో.

శా. కాంతారంబున నొంటి దోడుకొని, గాఁ
గాఁ జూచి గోవిందు శు
ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరా
గాయత్తులై తాఁకి దా
చెంతింబోయలు మూఁగి పట్టికొన నా
సీమంతినీ సంఘమున్
భ్రాంతిన్ భామినిభంగి నుంటి విడిపిం
పన్ లేక ధాత్రీశ్వరా.

శా. ఆత్రే, రా రథికుండ, నాహయము, లా
యస్త్రాసనం, బాశర
వ్రాతం, బన్ధ్యులఁ దొల్లి చంపుదుఁ దుదిన్
వ్యర్థంబు లైపోయె మ
చ్ఛేత్రోద్ధీశుఁడు చక్రి లేమి, భసిత
క్షిప్తాజ్య మాయాని మా
యాతంత్రోపరభూమిబీజముల మ
ర్యాదన్ నిమేషంబునన్.

అని చెప్పుచుండునపుడె ధర్మజుఁడు మూర్ఛిల్లి కొంత
నడికిఁ దెలిసి పరిపరివిధముల విచారించి శ్రీకృష్ణుని చేఁతలు,
నాతఁడు తమ కొనరించిన యుపకృతులు పేర్కొని, యాతఁడు
లేని యీలోకంబున నుండుటకు రోసి, వైరాగ్యమార్గమునఁ
నువుఁ ద్యజించుట యుక్తమని భీమాదిసోదరుల కావృత్తాం
ము నెఱింగింప, వారును నన్నతో ననుయాయులగుట కుద్య
ర, ద్రౌపది యనుగమనంబున కొడఁబడ, ద్రౌపదీసహితు
గాండవులు మహాప్రస్థానము సేయ నుద్యమించిరి.

పిమ్మట ధర్మజుఁడు, విధివత్తుగా గురువులవలన విద్య
యు, యువయు, యుగవ్యాయతబాహువు, వరిణద్ధకం
ని, అంసలుఁడు నగుటను రాజ్యభారధూర్వహణసమర్థుఁ
, రాజ్యలక్ష్మి వరిగ్రహణయోగ్యుఁడు నగు పరిక్షిత్తును,

మంత్రి సామంత దండనాథ పురోహితానుమతంబుగాఁ బౌరజన సమ్మతిని బొంది, రాజ్యాధీశుం జేయ నిశ్చయించెను.

ధర్మరాజానుమతినొందిన పరిక్షిత్తు శాంతిక పౌష్టిక క్రియలు నిర్వర్తింపఁజేసి, మొదటను ఔదుంబరదారునిర్మితమగు నాసందిపై, వన్యజంతువులలోను బశువులలోను క్షాత్రము కల దగుటచే వ్యాఘ్రచర్మము నుత్తరలోమముగాను, ప్రాచీనగ్రీవ ముగాను బఱచి, యవ దూర్వ వ్రీహ్యాద్యోషధీతోక్మములను, దధి మధు ఘృతాదికమును, యథావిధిగ నమర్చిన పురోహితు లాయా వస్తువినియోగపూర్వక కర్మములను జేసినపిమ్మట, నిట్ల నెను. "నేను రాజ్యముకొఱకు, సామ్రాజ్యముకొఱకు, భౌజ్య ముకొఱకు, స్వారాజ్యముకొఱకు, వైరాజ్యముకొఱకు, పార మేష్ఠ్య రాజ్యముకొఱకు, మహారాజ్యాధిపత్యముకొఱకు, నన్ను నేను వశముఁ జేసికొనుటకొఱకు దీని నధిష్ఠించుచున్నా" *నని యాసందిపై నున్న వ్యాఘ్రచర్మోపరిభాగంబున నెడమ మోకా లిపైఁ గుడికాలిపిక్క నాని కూర్చుండెను. క్షత్త్రియుఁ డభిషే కముఁ జేయవలయుఁ గాన, ధర్మజుఁడు మంత్రపూతోదకముగఁ కలశమును దెచ్చి, ఔదుంబరపర్ణము నడ్డుగ నుంచి, ఈయర్థము గల మంత్రములఁ జదివెను. "ఈయుదకములు శివతమములు, అన్నిటికి భేషజములు, ఇవి రాష్ట్రమును వృద్ధినొందించుచున్నవి ఇవి రాష్ట్రభృత్తున కమృతములు."

* ఐతరేయబ్రాహ్మణమున నీయంశము కలదు.

ప్రజాపతి యేయుదకములచే నింద్రుని, సోముని, వరుణుని, యముని, మనువును, అభిషేకించెనో యట్టి యీయాయుదకముల చేతనె యీతని నభిషేకించుచున్నాను. నేను నిన్ను రాజుల కధిరాజవగుమనియు, ఋషుల కింద్రుఁడ వగుమనియు, భూములకు సమ్రాట్టువగుమనియు, కోరుచు బలముకొఱకు, శ్రీకొఱకు, యశస్సుకొఱకు, అన్నాదులకొఱకు, ఆయువుకొఱకు, సవిత్రాది దేవతలఁ గోరుచు నభిషేకించుచున్నాను.

అని పరిక్షిత్తు నభిషేకింప నాతఁడు చేయఁగల విధుల నిర్వర్తించి * సభా సమితులు నాకు సుముఖములై యుండుఁ గాక యని ప్రజల కభిముఖుఁడై పలుకుచుఁ గనక సింహాసనము నెక్కెను.

అపుడు ధర్మజుఁడు, "ఓ పరిక్షిత్తా! అర్థులు పూర్ణకాములై గృహమునుండి ప్రీతినివర్తులగుటయే నీకులధర్మము, అదియే హితము, ఇష్టము, శివము నగును." అని యుపదేశింపఁ బరిక్షిత్తు నమ్రభావంబున గుర్వాజ్ఞను శిరసావహించితి ననెను. పిమ్మట ధర్మజుఁడు పౌర జానపదులకుఁ దమ మహాప్రస్థానము నుగూర్చి తెలిపి తదనుమతి నొంది ద్రౌపదితోఁ దమ్ములతోఁ

* అథర్వవేదమున రాజు సభాసమితులంగూర్చి చెప్పు వాక్యములు కాన్పించును. సభలోనివారు సభ్యులనియు, సమితిలోనివారు సామిత్యులనియుఁ బేరు కలిగియుండురఁట! (అవి హౌసాఫ్ కామన్సు, హౌసాఫ్ లార్డ్సువంటివి కావచ్చును.)

బయనంబయి, పరిక్షిత్తునకు, స దస దుపదేష్టగాఁ గులాచార్యుఁ డగు కృపుని, ప్రధానమంత్రినిగా యుయుత్సుని, నియమించి తమతో రా నుద్యుక్తురాలగు సుభద్రను, అర్జునుఁడు యదు వంశ 'కరీర' మగు వజ్రుని, పాండవవంశ 'కందళ' మగు పరిక్షిత్తును గాపాడ నియోగించి, ఉలూపీ చిత్రాంగదలను బభ్రువాహనుకడ నుండ నియమించి పాండ్యదేశమున కనిచెను.

---

## న వ మా ను వా క ము.

### పాండవుల స్వర్గారోహణము.

ధర్మజాదులు జ్యేష్ఠానుక్రమముగాఁ బూర్వాభిముఖులై మహోదధిని జేరునప్పు డగ్నిదేవుఁడు బ్రాహ్మణ రూపంబున వారిం దారసించి యభిమానధనుండగు ధనంజయుండు గాండివంబు విడువకుండుటఁ జూచి "అర్జునా! మహాప్రస్థానివగు నీకు గాండివధారణం బుచితంబు గాదు, శ్రీకృష్ణుఁడు చక్రంబుఁ గొనియే పరలోకగతుఁడయ్యెనా?" అన నాతండు దానికి సంత సించి మహానుభావా! నీవెవ్వండవన, తాను ధనంజయుండగుట

నెఱింగించి వరుణుం జేరుటకుఁగాను గాండీవమును సముద్రమున వైపించి యంతర్హితుఁడయ్యె.

జ్యేష్ఠానుక్రమంబుగ నడచు ధర్మజ భీమార్జునాదులకు హస్తిపురినుండియే యొక సారమేయము పృష్ఠగామియై వచ్చు చుండెను. ఇట్లు వారు పార్గ్దక్షిణ పశ్చిమసముద్రతీరములఁ జూచుచుఁ బశ్చిమసముద్రతీరమున జలధిమగ్నయగు ద్వారకా పురిం జూచి, కృష్ణునిఁ దలఁచుకొనుచుఁ క్రమంబుగ హిమవం తంబుం గడచి, జన్మస్థానమగు శతశృంగముఁ జూచిరి. అంత వెనుకను నడచు ద్రౌపది తటాలున భూమిపైఁబడి యసువులను విడిచెను. ఆవిధమును భీముఁ డన్న కెఱింగించి "ఈమెయం దేమిదోష మున్నది? సర్వసుగుణసంపదగల్గు నీమె యిట్లు పడు టకుఁ గతంబేమి?" అన నజాతశత్రుం డాతనితో నిట్లనియె. "భీమసేనా! ద్రౌపది మనయందఱియందు సమానముగ వర్తిం పవలసియుండియు నర్జునునియందు మనంబునఁ బక్షపాతంబు వహించియుండు, అక్కతంబున నీమె ముందుగ నసువుల విడిచి నది" అని నిలువక పోవుచుండఁ గొంతతడవునకు సహదేవుఁడు భూమిపై వ్రాలెను. అది యెఱింగి భీముఁ డన్నతో "సహ దేవుఁడు భూమిపైఁ బడుటకు హేతు వెయ్యది? జ్ఞాని యగు నీతఁడు నిర్దోషుఁడేకదా" అన, సమవర్తి సుతుండు "వృకోద రా! సహదేవుఁడు జ్ఞానంబునఁ దనకుఁ దుల్యు లెవ్వరును లేరని

ెజనుని ధిక్కరించును. అదియే యీతని ప్రాజ్ఞ్మరణమునకుఁ

గారణము" అని చెప్పి నిలువక పోవుచుండఁ గొంత తడవునకు నకులుఁ డసువుల విడిచి భూమిపైఁ బడెను భీముఁ డెప్పటివలె "అన్నా! కోమలహృదయుఁడగు నీతఁ డేల పొలిసెను?" అన, యుధిష్ఠిరుఁడు "పావనీ! నకులుఁడు తాను సౌందర్యవంతుఁడ నని తక్కఁగలవారిని మానసంబున వెక్కిరించుచుండును. అదియే యాతని పతనకారణము" అని నిలువక నడచుచుండఁ గొంతతడవునకు విజయుఁడు విశ్వంభరపైఁ బడి విగతజీవుండగుడు వృకోదరుం డెప్పటియట్ల యన్నతో "సకలగుణాభిరాముండును, కృష్ణాశ్రితుండును నగు నీవిజయుఁ డేల విగతజీవుఁ డయ్యెను?" అన, పరేతరాట్సూనుఁడు "మారుతీ! పార్థుండు కురుసైన్యంబుల నొక్కనాఁడ గెల్తునని చెప్పి యట్లు చేయలేకపోవుటచే నీతఁడు ముందుగ మృతినొందుటకుఁ గారణమయ్యె; మఱియు నీతండు తనకు సాటి ధనుర్ధరు లెవ్వరు లేరని ప్రతిపేరుని ధిక్కరించుచుండును, అందుచేత వివ్వచ్చుఁడు విగతజీవుఁ డయ్యెను" అని వెనుకఁ జూడక పోవుచుండెను. కొంతతడవునకు భీముండును గూలంబడి "అన్నా! నేనెందుల కిట్లు పడిపోవుచున్నాను?" అనఁ బితృపతిసూతి "పావనీ! నీచరితంబు పావనంబె యయ్యు నభిమానధనుండవగు నీ వమితభోజివి; మఱియుఁ బరుల బలంబును దృణీకరించి నిందించు దోషంబు నీయందుండుటంజేసి నీకిట్టి పాటు కలిగెను." అని యాతనివలను నైనను జూడకయె ధీరస్వాంతుండై సారమేయ ద్వితీయుండై చనఁజన, నింద్రుండు మా

తలి చోదిత రథం బెక్కి ప్రత్యక్షం బగుడు, ధర్మజుండు వినతి నొనర్ప నిందు్రిండు "ధర్మరాజా! ఏతద్రథం బధిరోహింపుము; నీసచ్చరితంబునకు సశరీరస్వర్గంబ యుచితం"బనుడు శమన సూనుండు "స్వర్పతీ! సోదరభోగ్యంబు పత్నిభోగ్యంబు గాని, నాకభోగంబు నాకభోగ్యంబు; నాపత్ని సోదరు లీభూలోకంబునం బడియుండ నే నెట్లు స్వర్గంబునకు గాఁగల"నన నింద్రుఁడు "ధర్మరాజా! నీపలుకులు ధర్మయుక్తంబులు; నీపత్నిసోదరు లిట భౌతికశరీరములను విడిచి యింతకుమున్న పరలోకంబున నున్నవారు. నీవట వారిం జూతు"వనెను. అప్పలుకులకు సమవర్తి సూతి సంతసించి సారమేయమునకుఁగూడ రథారోహణమున కనుజ్ఞఁగోర నాకపతి నవ్వి "మంత్రపూత పురోడాశము కాకభక్ష్యమగునే? స్వర్గ మెక్కడ సారమేయ మెక్కడ? సకల ధర్మవిదుఁడ వగు నీ విట్లాడ నుచితంబే?" అన సమవర్తిసూతి తన సమవర్తిత్వముఁ గనఁబరచుచు విశ్వాసియగు కుర్కురమును విడువరామిం దెల్పి దీర్ఘముగ వాదింప నింద్రుం డాతని ధర్మబుద్ధికి మెచ్చె. అంత సారమేయము సమవర్తియై శమననందనా! నీయోగ్యతం బరీక్షింప నిట్లు వచ్చితి నని స్వస్వరూపముఁ జూపి యంతర్హితుం డయ్యెను. అంత నింద్రసహితుండై ధర్మజుఁడు త్రివిష్టపంబుఁ జేరెను.

"రాజ్యాంతే నరకంధ్రువ"మ్మనునానుడి సార్థకము సేయ ధర్మజుఁ డింద్రునానతి నరకముఁ జూడనేఁగుచు స్వర్గంబున

నొక్కయెడ భోగియగు దుర్యోధనుఁ గాంచి, ఈసునకుఁ బుట్టి నిల్లును బహు వీరహనన హేతు పాపియు నగు నీతం డిట్లు స్వర్గ సుఖమునొందఁ గారణం బేమని విచారించుచు, 'రౌరవ, తామిస్ర, కుంభీపా'కాది నరకంబులఁ జూచుచు, యాతనాదేహంబుల నొంది యాతనల ననుభవించు జీవులయార్త నాదంబుల నాలకించి యుద్విగ్నమానసుండై, పోవంబోవ నొక్కయెడ నపూర్వ దృష్ట స్వరూపంబుల నొంది యైదుగురు పురుషులు నొక వనితయు, "మహానుభావా! యుధిష్ఠిర మహారాజా! అట నించుక నిలు నిలు, నీదర్శనమాత్రంబున—నీగాత్రపుగాలి సోఁకినంతమాత్రమున—మాయాతన లుపశమిల్లుచున్న"వని శ్రుతపూర్వస్వరంబులం బలుకుడు, 'డౌమని నిర్విణ్ణుండై మీ రెవ్వ?"రన "నేను కర్ణుండ, భీముండ, అర్జునుండ, నకులుండ, సహదేవుండ, ద్రౌపదిని" అని వారనిరి. ధర్మజుఁ డామాటల నాలించి దుఃఖార్తుండై కూలఁబడునంతలో దేవదూత యేతెంచి "మహారాజా! దేవేంద్రుఁడు దేవలోకంబునకు మిమ్ము రమ్మని యానతిచ్చుచున్నాఁ"డన, ధర్మజుఁ డాతనితో నిట్లనియె. "ఓయీ! నాసతీ సోదరు లిట నరకయాతన లనుభవింపుచుండ నే నెట్లు స్వర్గంబునకు రాగలను? నాకిదియే స్వర్గము; నేను రానని బిడౌజునిఁ బలుకుము" అన నాతండు వోయిన యనతికాలంబున కింద్రుఁడే తెంచి "రాజా! నీసతీసోదరులు స్వర్గమును జేరిరి. కర్ణభీమార్జున నకుల సహదేవులును, ద్రౌపదియుఁ గ్రమముగా జ్ఞాత

సోదరాపకృతిచేతను, పరధిక్కారపారుష్యంబునను, అన్యథాను ష్కధిక్కారంబునను, స్వసౌందర్యపుగర్వంబునను, జ్ఞానంభా వాహంభావమునను, పార్థుపైc బక్షపాతంబునను, తాత్కా లికపు నరకము నొందిరి. అది యిటమీఁద లేదు. రా రమ్మన సంతసించి, సునాసీరా! దుర్యోధనుం డేల స్వర్గము నొందె నన, పురందరుం డో యుధిష్ఠిరా! దుర్యోధనునం దెన్నిదోషంబు లున్నను, ఆతండు సుయోధనుండై రణహతుం డగుటచే వీర స్వర్గముc జూఱఁగొనె; నీ వింకను మానుషదేహంబు నొంది యుండుటచె నీర్ష్యాసూయలు నిన్ను వదలలేదు. పురోదృశ్య మాన వియద్గంగలోc గ్రుంకు మన నతం డట్లు సేసి దేవత్వ మొంది సూర్య పవ నేంద్రాశ్విసులc గూడిన కర్ణ భీమ పార్థ యమళులను మహాశక్తిం గలిసిన ద్రౌపదిం జూచి సంతసిల్లి, అనిర్వచనీయమోక్షము నొందెను. ఇటc బరిక్షిత్తు నారదు వలనc బితామహులు సన్యాసులై స్వర్గము నొందుట విని నారా యణబలి విధానమున నిష్కృత్యాణాం డయ్యె.

ప్రథమప్రపాఠకము సమాప్తము.

# ద్వితీయ ప్రపాఠకము.



## ప్రథమానువాకము.

—o—

### పరిక్షిద్రాజ్యపాలనము.

పరిక్షిత్తు, పితామహదత్తమగు రాజ్యముఁ బొంది "*దినాంతమున సూర్యునిచే నిహితమగు తేజము నొందిన యగ్నివలెఁ" బ్రకాశించెను. ఆతనికి, బాల్యముననె కురువీరుల శిరోంబరములం బొమ్మపొత్తికలగాఁ జేసికొన నభిలషించి తదభిలాషమును నెఱవేర్చుకొనిన యుత్తర, కన్నతల్లి—పదునాఱవ యేఁటనె యతిరథ మహారథులను నేలకుఁ గోలకుఁ దెచ్చి భీష్మద్రోణాదులచే ననదుగాఁ డితఁడని నుతింపఁబడిన యభిమన్యుఁడు తండ్రి—ముక్కంటితో నెక్కటికయ్యమునఁ బోరి మెప్పొందిన విజయుండు పితామహుండు—వీరసోదరి వీరపత్ని వీరప్రసవ యగు సుభద్ర పితామహి—భీమసుయోధనార్జునాది మహావీరులకుం గురువగు కృపాచార్యుం డాచార్యుండు—తాను విద్యచే మనశ్శక్తిని, సాముగరిడీలచే శరీరశక్తిని, శస్త్రాస్త్ర విన్యాసాదులచే శస్త్రాస్త్రశక్తిని, పరిశ్రమముచే దృఢముష్టిలక్ష్యలాఘవములను, అలవఱచుకొనినట్టి దిట్ట—అయినను బరి

* "సూర్యుని తేజస్సు రాత్రి యగ్నియందుఁ బ్రవేశించునని వేదమునఁ గలదు.

క్షిత్తు పరరాష్ట్రముల నాక్రమించుట యుక్తము గాదనుకొనెను. కారణ మేమన, కురుపాండవయుద్ధఫలముగా దేశము నిర్మనుష్య కల్పమై, జీవించిన పాండవేతరపక్షమువారు పుత్రకళత్రాదులతోఁ బరిదేవించుచుఁ బాండవభీతిని బలాయితులై, పరదేశముల కేఁగుటచేతను, కృషి పాశుపాల్యాదివృత్తులు గలవారు సేనా శిబిరాది పరివారముగా సుయోధనునిచే నియమింపఁబడి యాధి వ్యాధులచే నశించుటచేతను, పరిసరములఁ జెలరేఁగిన కిరాతులు దారి దోఁపుడుగాండ్రయి జనపదముల దోఁచికొన నాజనపద వాసులు పలాయితు లగుటచేతను, కురుదేశమున వ్యవసాయము సన్నగిలినది; దీనికిఁ దోడు వడగండ్లవానచే నున్న పంటలును నశించినవి. *చాక్రాయణుఁడను "ఉషిస్తి" ఋషివంటివాఁడె యాకటవునఁ గురుదేశములో నేనుఁగులకాపరి యొంగిలి "అల చందల"ను దిని జీవింపవలసి వచ్చినది. అట్టిపరిస్థితులం గాంచి యుఁ జిన్నతనమునుండియు మహాయుద్ధమునలన నగు దుష్ఫల ములం దలంచియు మనస్సు కరఁగి పరిక్షిత్తు పరరాష్ట్రాక్రమణే చ్ఛను మాని ప్రజారంజన తత్పరుండై స్వరాష్ట్రాభివృద్ధికర కార్యములను నిర్వహింపఁ గడఁగె.

తొలుదొల్తను దేశమును విడిచి పోయిన కౌరవులను సన్మానించి రప్పించి వారు గృహములు కట్టుకొని పాడిపంట

---

* ఈకథ ఛాందోగ్యోపనిషత్తున వర్ణింపఁబడెను. ఈకథ జనమే జయుని పుత్రునికాలమున జరిగెనని పక్షాంతరము.

లనుభవించురీతిని సదుపాయములఁ జేసెను. అందుల కాకుటుం బములవా రానందించుచుండిరి. ఆవృత్తాంతము నొకఋషి యిటులు గానముఁ జేసియున్నాఁడు.

(1) "పరిక్షిత్తు సింహాసన మెక్కి మాకు క్షేమముఁ జేయుచున్నాఁడని యింటిని గట్టుకొనుచు నొక కౌరవ్యుఁడు భార్యతో ననుచున్నాఁడు."

"నీ కేమికావలయును. పెరుఁగా? పాయసమా? మద్య మా? దేనిని దెత్తు నని పరిక్షిద్రాజ్యమునందు భార్య భర్త నడుగుచున్నది."

కౌరవకుటుంబముల నిటుల సంతోషపెట్టి నదులనుండి నీటిని గాలువలమార్గమున భూమిపైఁ బ్రవహింపఁజేసి సస్య ములు వృద్ధియై పంట లభివృద్ధి నొందునటులఁ జేసెను. ప్రజలు సుఖముగ నుండిరి. ఆవృత్తాంతమును వేఱొకముని యిటులు గానముఁ జేసెను.

(2) "ఏభూమియందు, సముద్రములు నదులు నీటి నిచ్చుచున్నవో, ఏభూమియందు దున్నుటచే సస్యము లుత్పన్న

---

(1) "పరిక్షిన్నః క్షేమమకరత్తమ ఆసన మాచరన్ కులాయం కృణ్వన్ కౌరవ్యః పతి ర్వదతి జాయయా"

"కతరత్త ఆహరాణి దధి మన్థం పరిశ్రుతం జాయాపతిం విపృచ్ఛతి రాష్ట్రే రాజ్ఞః పరిక్షితః॥ అథర్వసంహితా 20-128.

(2) యస్యాం సముద్ర ఉత సింధు రాపో యస్యా మన్నం కృష్టే యస్సంబభూవుః॥

స్థానమునందు గలది. ఆబంగరుగనులు గల భూమికి నమస్కారము."

(1) "ఏభూమియందు వృక్షములును, పుష్పింపక కాచెడి (మఱ్ఱిమొదలగు) వృక్షములును, వ్యాపించియున్నవో, అనేకవిధములుగా నినుమును ధరించియున్నదో, అట్టిభూమి రక్షించుఁగాక."

(2) "తేజస్సును బలమును గలిగించు నన్నభాగమగు నేతి నొసఁగు నోభూమీ! నిన్ను స్తుతించుచున్నాము."

(3) "ధనము రత్నములు బంగరు దొరకెడి నిధులను, గుహలను, ధరించెడి భూమి మంచిమనస్సుతో నాకు ధనము నొసంగుఁగాక."

(4) "అనేకభాషలను మాటలాడుచు నానావిధధరములు గల జనులకు వారివారిస్థితుల కనుకూలముగా నుండిన యీభూమి, గోవు పాల నిచ్చునటుల సహస్రవిధములుగా ధనము నొసఁగుచున్నది."

(5) "ఓదేవా! ఏమార్గములు విశేషముగా జనులచే నడపఁబడుచుండెనో యారథమార్గము, బండిదారులు, కాలి

---

(1) యస్యాం వివృక్షా వనస్పత్యా ధ్రువాస్తిష్ఠంతి విశ్వహా, పృథివీం విశ్వధాయసం భృతా మచ్ఛావదామః॥ (2) ఊర్జం పుష్టం బిభ్రతీ మన్నభాగం. ఘృతం, త్వాభి నిషీదే సుభూమే॥ (3) నిధిం విభర్తి బహుధా గుహా వసు మణిం హిరణ్యాం పృథివీ దధాతు మే. వసూని నో వసుదా రాసమానా దేవీదదాతు సుమనస్యమానా॥ (4) జనం విభ్రతీ బహుధా వివాచ

దారులు, మంచివారికిఁ జెడువారికి నుపయోగపడుచున్నవి. ఆ దారులయందు శత్రువులును దొంగలును లేకుండఁగఁ గాపాడుము. ఈభూమియం దేది మంచిది కలదో దానిని మాకిమ్ము."

(6) "భూమిమీఁదఁగల గ్రామములలో నరణ్యములలో సభలలో జనసమూహములలో సమితులలో మేము నీకుఁ బ్రియమైనటులు మాటలాడుదుముగాక!"

(7) "ఓభూమీ! నీయందుఁగల హిమవత్పర్వతములు, అరణ్యము, ఆనందము నిచ్చుగాక. పచ్చని నల్లని తెల్లని రంగులు గలుగు ననేకవిధ క్షేత్రములు గలిగి యింద్రునిచే రక్షింపఁబడుచున్న యీభూమి జన్మాంతమువఱకు నానంద మిడుఁగాక."

పరిక్షిత్తును స్తోత్రము చేసినయెడల పశుభాగ్యాభివృద్ధి యగుననియు దేవతల స్తవముతో నది సమ మనియు నాఁటి

---

సం, నానాధర్మాణం పృథివీయథౌకసం। సహస్రం ధారా ద్రవిణస్యమే దుహాం ధ్రువేవ ధేనురనపస్ఫురంతీ॥ (5) యేతే పంథానో బహవో జనాయనా రథస్య వర్త్మానసశ్చ యాతవే యైస్సంచరం తుభయే భద్రపాపాస్తం పంథానం జయేమానమిత్ర మతస్కరం యచ్ఛివం తేన నో మృడ॥ (6) యేగ్రామా యదరణ్యం యాస్సభా అధిభూమ్యాం యేసంగ్రామా సమితయస్తేషు చారు వదేమతే॥ (7) గిరయస్తే పర్వతా హిమవంతోరణ్యం తేపృథివీ స్యోనామస్తు. బభ్రుం కృష్ణాం రోహిణీం విశ్వరూపాం ధ్రువాం భూమం పృథివీ మింద్రగుప్తాం అజీహతే అక్షతో భ్యష్ఠ్యాం పృథివీమవత్.॥

ఋషులే తలఁచుచుండిరి. మఱియు నాతఁడు సర్వసముఁడనియు నందఱకుఁ బ్రేమాస్పదుఁడగు రాజనియు, వేయునేల, భగవత్సముఁడే యనియు, యజ్ఞకర్మములయందు 'బ్రాహ్మణాచ్ఛంసి' "న్యూంఖ"గా గానము చేయుచుండెను. పరిక్షిత్స్తవము గల భాగమును "నారాశంసి" యందురు. పరిక్షిత్స్తవముగల ఋక్కులకు "కుంతాపసూక్త"మని పేరు. పరిక్షిత్తునందుండు గౌరవాతిశయముచే "మహీదాస" మహర్షి తన "ఐతరేయబ్రాహ్మణములో" (1) పరిక్షిత్తనఁగా నగ్నియనియు, అగ్ని ప్రజలఁ జుట్టుకొని యుండునటులఁ బరిక్షిత్తు ప్రజలఁ జుట్టుకొని యుండునని యు లేక ప్రజ లగ్నిని మూఁగినటులఁ బ్రజ లాతనిచుట్టు మూఁగుదురనియు లేక పరిక్షిత్తన సంవత్సరమనియు సంవత్సరము ప్రజలఁ జుట్టుకొనునటులఁ బరిక్షిత్తు ప్రజల నావరించునని యు లేక ప్రజలు సంవత్సరమును జుట్టునటులఁ బరిక్షిత్తుం బ్రజలు చుట్టుదురనియు బ్రాహ్మణించియున్నాఁడు.

"అంగిరస్సు" అను ముని తన యథర్వవేదమున నిట్లు పరిక్షిత్తును గుఱించి చెప్పెను.

---

(1) "న్యూంఖః పారిక్షితీః శంస త్యగ్నిర్వై పరిక్షిద్ అగ్నిర్హీమాః ప్రజాః పరిక్షే త్యగ్నిం హీమాః ప్రజాః పరిక్షయం త్యగ్నే రేవ సాయుజ్యం సరూపతాం సలోకతా మశ్ను తే. యఏవం వేద. యదేవ పారిక్షితీః 3 సంవత్సరోవై పరిక్షిత్సంవత్సరో హీమాః ప్రజాః పరిక్షేతి. సంవత్సరం హీమాః ప్రజాః పరిక్షయంతి సంవత్సరస్యైవ సాయుజ్యం సరూపతాం సలోకతా మశ్ను తే. యఏవం వేద॥ ఐతరేయబ్రాహ్మణ 6-6.

(1) "ఓగాయకుఁడా! పశువులను భాగ్యమును సమకూర్పఁగల ఋక్కులను బఠింపుము. విలుకాఁడు విశిఖమును గుఱిపెట్టునటుల దేవతలకుఁ బ్రార్థనను సిద్ధము చేయుము."

"పరిక్షిత్తు స్తవమును వినుఁడు; అతఁ డందఱు ప్రజలకుఁ బ్రేమాస్పదుఁ డగు రాజు, మానవులకు భగవంతుఁ డగు నగ్నివలె నధికుఁడు."

పరిక్షిత్తుచేఁ బాలింపఁబడెడి కౌరవ్యులుకూడఁ గౌరవమునానే చూడఁబడినటులు "మహీదాస" మహర్షి కౌరవశబ్దమునుగూడ 'న్యూంఖ'గా నుచ్చరింపవలయు ననుటచే నూహింపఁబడుచున్నది. కౌరవ్యులు కళ్యాణమగు కర్మమును జేయువారని, 'ఐతిరేయబ్రాహ్మణము'న నిట్లు చెప్పఁబడెను

(2) కౌరవ్యశబ్దమును న్యూఁఖగా నుచ్చరింపవలెను. దేవత లేకల్యాణకర్మమును జేసిరో యది కౌరవ్యులచేఁ బొందుచున్నారు. అట్లే, యజమాను లేకల్యాణకర్మమును జేయుచుండిరో యది కౌరవ్యులచే యజమానులు పొందుచున్నారు."

---

(1) ప్రరేభరం భరస్య గోవిదం వసువిదం । దేవత్రేమాం వాచం శృధోషునవీరో అస్తా॥ రాజ్ఞోవిశ్వజనీనస్య యోదేవో మర్త్యా అతి । వైశ్వానరస్య సుష్టుతిమాః శృణోతా పరిక్షితః॥ అథర్వ. 20-127.

(2) బ్రా॥ న్యూంఖః కౌరవ్యాః శంసతి. దేవావై యత్కించ కల్యాణం కర్మా కుర్వం స్తత్కౌరవ్యాభి రవాప్నువం స్తథైవై తద్యజమానాః యత్కించ కల్యాణం కర్మా కుర్వంతి తత్కౌరవ్యాభిరాప్నువంతి॥

ఐ. బ్రా. 6. 54.

పైయంశముఁబట్టి పరిక్షిత్తునకు లోఁబడిన కౌరవులు గౌరవకార్యములఁ జేయుచుండి రని తోఁచును. మఱియు "అంకురారోపణము" (గింజలను మొలపించుట) కల్యాణకర్మముగా యజ్ఞములయందును, వివాహాదిశుభకర్మములయందును నెంచఁబడును. కాన కౌరవ్యులు వ్యవసాయకులైనఁ గావచ్చును. యజమానునకుఁ గల్యాణకర్మమును జేయువా రనుటచేఁ బరిక్షిత్తునకు భృత్యులైన నగుదురు. 'న్యాంఖ' యను గౌరవ బిరుదము కౌరవ్యుల కుండుటచే, పరిక్షిత్తుకడ కౌరవ్యులు రాజపురుషులైనఁ గావచ్చును.

ఇట్లు సర్వసమ్మతముగ సుఖకరముగ రాజ్యపాలనాది వ్యవహారములను స్థిరపఱచి దేశము ధన ధాన్యప్రజాసంపద్యుక్తముగాఁ జేసి పరిక్షిత్తు వినుతి నొంది సంతుష్టుఁ డయ్యెను.

---

## ద్వితీయానువాకము.



### మాద్రవతీపరిక్షిత్తుల వివాహయత్నము.

ఆశ్రమచతుష్టయములో గార్హస్థ్యము తక్కిన యాశ్రమత్రియమునకు నాధారభూతము. అందువలననే "బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి జటి పరివ్రాజకాదు"ల కాధారభూతము గృహస్థాశ్రమ మని యొక కవి చెప్పెను.

గృహస్థాశ్రమమును స్వీకరించుటకుఁ బూర్వము ముప్పదియాఱు, లేక పదునెనిమిది, కాకున్నఁ దొమ్మిది, సంవత్సరములు

గురువుకడ వేదాధ్యయనముఁ జేయువలయు నని 'మన్వాదులు' విధించియున్నారు. ఆధర్మము ననుసరించి పరిక్షిన్మహారాజు, ముప్పది యాఱేం డ్లుత్తమమగు బ్రహ్మచర్యము నవలంబించి, అధీత వేద వేదాంగుఁడై "ఫలవదర్థావబోధ పర్యంతము" రాజ నీతి నభ్యసించి గార్హస్థ్యముచే "పురుషార్థత్రయమును" సాధింపఁ దలఁచెను.

(1) "ఏస్త్రీయందు మనస్సు, కన్నులు నిబద్ధమైయుండునో, ఆ స్త్రీయందే సంతానాద్యభివృద్ధి యగును." అనియు, రూప శీలాదులు గలుగు నామె నుద్వాహము కావలె ననియుఁ మహర్షులు వక్కాణించుటచే నట్టి యాపె "ఉత్తరమద్రదేశము" నేలునట్టి "శల్యునకు" పౌత్రిఁడగు నుపశల్యునికుమార్తె మాద్రవతి యనునామె కల దని విని యామె వృత్తాంతము నరసి రమ్మని విదుషీమణులగు నంతఃపురపరిచారికల నంప, వారు 'మాద్రవతిని' జూచి, కతిపయదినంబులకేతెంచి పరిక్షిత్తుమోలఁ దమయభిప్రాయముల నిటుల విన్నవించిరి. "మహాప్రభువా! శిరీషకుసుమకోమలియు సర్వాంగసుందరియు నగు మాద్రవతి, తన్వి,-శ్యామ,-సుభ్రు,-కేకికచ,-మంజుభుజ,-శిఖరిదశన,-పక్వబింబాధరోష్ఠి,-చకితహరిణీప్రేక్షణ,-ఉడురాజముఖ,-మృగరాజకటి,-గజరాజవిరాజితమందగమన" పలు పలుకు లేల? అచ్చిలుకులకొలికి, పలుకులఁ బలుకులవెలందిని, రూపునఁ గలు

(1) "యస్యాం మనశ్చక్షుషోర్నిబంధస్తస్యా మృద్ధిః"॥ ఆ. గృ

ముల చెలిని, తలపింపఁ జేయుచు, యువతీసృష్టిని జేయునపుడు బ్రహ్మదేవుఁ డాదిని యీమెను సృష్టించెనో యనునట్లుండును, ఆమె యాకారమునకుఁ దగినవిద్యయు—విద్యకుఁదగిన ప్రజ్ఞ యు—ప్రజ్ఞకుఁదగిన సౌశీల్యమును—సౌశీల్యమునకుఁ దగిన చేతలు—కలిగి, సర్వవిధముల నీకుఁ దగి యున్నది. ఆమెయు నీవును గూడిన "సరస్వతింగూడిన బ్రహ్మవలె, లక్ష్మిం గూడిన విష్ణువువలె, గౌరిం గూడిన గిరీశునివలె నుందువు."

అని చెప్పి మాద్రవతీచిత్రపటం బొసఁగి సమర్పింపఁ బరిక్షిత్తు చిత్రదర్శనంబునన 'దృగవస్థను, బిమ్మట మనస్సంగ, సంకల్ప, జాగరావస్థల' నంది మఱుచటి మధ్యాహ్నమునకె కార్శ్యము నొంది, అరతిచే నాహారాభావము గలుగ సాయంకాల మువఱ కెట్టెటులో విరాళిని సహించి, హ్రీత్యాగముఁ జేసి, అయ్యరాతిభీకరుండు, రాతిరి (1) రాతితో, మంతనంబుండి, మాద్రవతి నుద్వాహ మగుట కుద్యోగించి మఱునాఁడు మంత్రివంతులు ప్రయాణయోగ్యోచిత వస్తుసమన్వితులు సుహృత్తులు నగు కృపాదివృద్ధులఁ గొందఱఁ దనకొఱకు మాద్రవతి యను కన్యను వరింపఁ డఱి పంప, వారు కతిపయదినంబులకు మద్రపురి కేగి తద్దేశాధీశ్వరుం ఇట్లనిరి,

"ఓమహారాజా! (2) ఆంగిరస గౌరవీత సాంకృత్య,

(1) "రాతినా సంభాష్య యథార్థం గచ్ఛతి" అ గృ. సూ.

(2) భీష్మ ధర్మజులు వైయాఘ్ర గోత్రజులని భాగతమునఁ గలదు.

ప్రవ రాన్వితుండును 'వైయాఘ్ర' గోత్రజుండును, పాండురయశో విరాజితుండగు పాండు వర్మకు నప్త్రయు, దుర్జనసంతర్జనుం డగు నర్జున వర్మకుం బౌత్రుండును, వీరాధివీరుం డగు నభిమన్యు వర్మకుం బుత్రుండును, కృష్ణీకృత శత్రుప్రియశస్కుండును, కృష్ణపరీక్షితుండును నగు పరిక్షిద్వర్మకు మీపుత్రికాలలామయగు మాద్రవతిని వరింపవచ్చితి" మనిరి.

ఆ యుపశల్యుండు, పాండు నకులులకుం, దమ యాండు బిడ్డల నిచ్చుటచేం బూర్వపుసంబంధమని సంతసించి, వృద్ధమంత్రి పురోహితులకును తనరాణికి నెఱింగించి మాద్రవతి కావృత్తాంతముం జెప్ప నంతకుముందె పరిక్షి ద్రూపగుణసంపదలను విని పరిక్షిత్తునకు సమానమగు ననంగదశల ననుభవించు నా మాద్రవతి, అత్యంతానందము నొంది చూపులచేతనే సమ్మతిం దెలుప నుపశల్యుండు గౌర్యాది పూజలం గావింపంజేసి కృపాదులకు సమ్మతిం దెలిపి, కులవృద్ధ పురోహితులతో వారికడ కేతెంచి, "కాశ్యపా వత్సా రాసిత" ప్రవరాన్వితుండును, కాశ్యపస గోత్రజుండునై శత్రుహృదయ శల్యుండగు శల్యవర్మకు నప్త్రియు, నిర్జితదర్ప వరాకర్షముండగు మద్రవర్మకుం బౌత్రియు, నతామిత్ర

---

భీష్మతర్పణవిధిని జెప్పు స్మార్తానుక్రమణికాదులలో భీష్ముఁడు సాంకృతి ప్రవరాన్వితుం డని చెప్పంబడెను. ఆపస్తంబ ఆశ్వలాయన, ప్రవరఖండలలో వైయాఘ్రగోత్రము వ్యాఖ్యాను, సాంకృతిప్రవగ కలదు. ఆప్రవర యిచట గ్రహింపంబడెను.

విశల్యకరణియగు నుపశల్యవర్మకుఁ బుత్రికయు, సర్వమంగళగుణ ములచే సర్వమంగళా సమానయునగు మాద్రివతిని, పరిక్షిద్వర్మ కిచ్చుచుంటి మని చందనతాంబూలాదుల నిచ్చి బహూకరించి కార్తాంతికులను రావించి ముహూర్తముఁ దెలుపుఁ డన వారు "జామిత్రశుద్ధియుఁ బంచకరహితము శుభగ్రహదృగ్బలము గల లగ్నము" నిర్ణయించి యాసన్నముహూర్తమునె తెలుపఁ గృపాదు లాశుభవార్తను వేవేగమె పరిక్షిత్తునకుఁ దెలుప జంఘాలురను ముందంపి, తాము గతిపయప్రయాణంబులు చేసి హాస్తిపురిం జేరి యంతకుఁ బూర్వమె శుభవార్తఁ దెలిసిన పరిక్షిత్తునకు సవిస్తరముగఁ దాము పోయి వచ్చిన యంశముల నెఱిఁగించి సంతసింపఁజేసిరి. ఉత్తరా సుభద్రలు కృపునిచే యావద్వృత్తాంతముఁ దెలిసి, కలిసిన సంబంధమే యని సంతసించిరి.

---

## తృతీయానువాకము.

### పరిక్షిత్తు మాద్రవతిం బెండ్లియాడుట.

పరిక్షిత్తుచేఁ గృప యుయుత్సులు వివాహమంగళోచిత కర్మకలాపంబులు నిర్వర్తింప నియుక్తులై మిత్ర బంధు సామంత దండనాథాదులకు శుభలేఖలను వ్రాయించియు, కులవృద్ధుల నంపియుఁ, దరలిపోవు దివసంబునకుఁ బూర్వదినంబుననె వారు వచ్చునటులు నేసిరి. యుయుత్సుచే స్వయముగ నాహూతుఁ

డగు బభ్రువాహనుండు సపరివారుండై రాఁ బరిక్షిత్తు, తండ్రి యగు నభిమన్యుండు వచ్చినటులె సంతసిల్లెను.

పెండ్లికిఁ బెద్దలు, వృద్ధులగు నైదువలు, ముద్దియలు, విద్దెల నారితేఱిన సద్గురువులు, వివాహకర్మకలాపంబులు నిర్వర్తించు పురోహితులు, మంత్రి దండనాథులు, సహాధ్యాయులు, సతీర్థులు, మిత్రులు, భృత్యులు, పరిచారికా పరిచారకులు, వీరభటులు, పాచకులు, వీణా వేణు భేరీ కాహళాది మంగళవాద్య నాదకులు, పయనం బయిరి. వారిలో వివాహములకు సాధారణ ముగవచ్చు 'పాత్రిసమ్మితులు' గాని 'దేవానాంప్రియులు' గాని లేకుండిరి. వారు రథములపై వాహనములపై శకటములపై నడకలపైఁ బ్రయాణంబులు సాగింపఁ దివురుచుఁ దొడరా, పరిక్షిత్తు నీలనీరదసన్నిభంబులగు నాజానేయములఁ బూన్చిన తేరిపై మృగరాజలాంఛనం బగు కేతనంబు నెత్తించి,శుభాలంకృతుండై, ఉచితపరికరంబుల నవలంబించిన నూతునితోఁ గూడిన యారథము మంగళవాద్యంబులు భూనభోంతరాళంబు మాఱుమ్రోయ నధిరోహించి, ఇంద్రునివలెం బ్రకాశించుచు మద్రపురీ పరిసరంబుం జేరెను.

ఉపశల్యుండును మహోత్సాహంబున బంధుమిత్రామాత్య పురోహితాదులతో నెదురు సన్నాహంబుఁ జేసి, ఆచ్ఛాద నాలంకరణంబులం బరిక్షిత్తును బభ్రువాహనుఁ దక్కంగలవారిని గౌరవించి, పిమ్మట "ముక్తాఫల స్రగ్మణి చిత్రి

రథ్యయు, తప్తకార్తస్వర వేశ్మజాలయు, మహేంద్ర నీలోపల హార్మ్యమాలయు, చంద్రాశ్మ సౌధాంతర లోలడోలయు, లసత్పతాకామలశాభిరామయు, అశేష మనోభిరామయు నై, అలంకృతమగు తనపురిలో నొక్కయెడ 'విశాలచామీకర చంద్రశాలయు, ఇందుకాన్తోపల బద్ధకుడ్యయునై' చంద్రాశ్మనీలోపల స్తంభంబులపై నున్న కృత్రిమ పుత్రికల హస్తంబుల నొప్పారు దీపికలచేఁ బ్రకాశమాన మగు నొక ప్రాసాదమునఁ బరివార సహితంబుగఁ బరిక్షిత్తును విడియించి పెండ్లివారికిఁ దగినయాహారోపహారాదుల నేర్పఱచెను.

పిమ్మటఁ గార్తాంతికు లాసన్నముహూర్తముం దెలుప మంగళస్నాతులు, అలంకృతులు నగు మాద్రవతీ పరిక్షిత్తులను ముత్తెంపుముగ్గుల, రతనంపుతోరణంబుల, శాతకుంభ స్తంభంబులఁ జిత్రవిచిత్ర కృత్రిమపుత్రికలచేతులం గల కరదీపికలచే విరాజిల్లు కల్యాణమంటపము నుభయపక్షములవారును జేర్చ, బ్రాహ్మణులు స్వస్తివాచకంబు లనుపఠింపఁ బరిక్షిత్పురోహితుండగు 'ఉపధ్యాముఁడును' ఉపశల్యపురోహితుండగు 'సుమంతుండును' బ్రహ్మపీఠంబుల నధివసించి "కైతకశిఖాలీలాయిత సుస్మితు" లగు దంపతులఁ బెండ్లిపీటలకుఁ దెచ్చిరి. సుమంతుఁడు, ప్రాచీనగ్రీవము నుత్తరలోమము గలుగు 'అనడుహ' చర్మముపైఁ బరిక్షిత్తు నుపవిష్టుం జేయించె. ఉపశల్యుండు తన జాయ సువర్ణకలశంబున నుదకంబు.పోయఁ బరిక్షిత్పాదంబులఁ

